# హెచ్చరిక

ఈ నాటకము ప్రదర్శనహక్కులు నాకు చెంది యున్నవి. గాన నాటకము ప్రదర్శించువారు ముందుగా పర్మిషనుఫీజు చెల్లించి నాచే రశీదు పొందవలెను. అట్లు చెల్లించని వారిపై నేను జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు. ఇందు మూలముగా తెలియజేయడమైనది.

ఇట్లు,

దత్తి అప్పారావు,

మల్లిఖార్జున పేట, విజయవాడ-1.

# అన్నా - చెల్లెలు

## ఒకటవ రంగం

[రామయ్యగారింటి చావిడీ, యెదురుగా గుమ్మం. గుమ్మం వెలుపల గోడప్రక్కను ఒకపాతసైకిలు, మరొకప్రక్క విరిగిన కుర్చీ, పాతబల్ల వుంటాయ్. గుమ్మంలోపల, పడుకున్న రామయ్య పాదాలుమాత్రంగాకనిపిస్తూవుంటాయి. సీత వెలుపలనుంచి కుండతో నీళ్లుతెచ్చి లోపలకు వెళ్ళ బోతుండగా ఖాళీబిందె పట్టుకుని లోపలనుంచి రంగడు వస్తాడు.]

సీత: ఇంకా వెళ్ళలేదూ!

రంగ: సిగ్గేస్తుందక్కా!

సీత: సిగ్గేస్తుందా?

రంగ: ఇత్తడిబిందె మీదెవరిస్తారక్కా డబ్బు?

సీత: బంగారపు బిందెలుంటే యీ పాట్లెందుకూ? రంగా! నీకు తీసుకు వెళ్ళడానికి బాధగావుంటే అక్కడేపడేయ్ నన్నిట్టే వేధించకు.

[సీతలోపలకు వెళుతుంది. విసుగ్గా దీనంగా బిందె తీసుకుని వీధివైపుకు వెడతాడురంగడు. సీత చీపురుతో తిరిగివచ్చి

చావిడి తుడుస్తూవుంటుంది. ఒకక్షణం గడచిన తర్వాత సూర్యం వీధిలోంచి వస్తాడు. నెత్తిమీద టోపీ తీసుకుంటూ లోపలకు వెళ్తాడు. తుడుస్తోన్న సీత అలికిడి విని చూస్తుంది. సూర్యంలోపలనుండివస్తాడు.]

సీత : ఏంజరిగింది?

సూర్యం : (మౌనం)

సీత : లైసెన్సు యిచ్చారా?

సూర్యం : లేదు.

సీత : వాయిదా వేశారా?

సూర్యం : అవును.

సీత : ఎప్పుడు?

సూర్యం : ఇంకా పదిహేను రోజులుంది.

సీత : అంతవరకూ బ్రతకడం?

సూర్యం : ఆసంగతి వాళ్ళు చెప్పలేదు.

సీత : మేనేజరుగారు కనుపించారా?

సూర్యం : ఆఁ కనుపించారు. డబ్బు అడిగాను... డబ్బులేకా బాధపడుతూ, ఎవరన్నా చచ్చేవాళ్ళుంటే సుఖంగా చావనిమ్మని చెప్పారు.

సీత : డబ్బు లేనివాళ్ళంతా చావాల్సిందే?

సూర్యం: తప్పకుండాను.

సీత : మరి ప్రపంచం?

సూర్యం : ప్రపంచానికేం! భారం తగ్గిపోయి తేలికవుతుంది. స్మశానమైతే మరీ సంతోషిస్తుంది.... మనిషి బ్రతుకే బాధగా వున్న ఈ రోజుల్లో, ఒక మనిషి పోవడమే దేశానికి మహోపకారమేమో.

సీత : ఏమిటన్నాయ్ ఆమాటలు?

సూర్యం: ఏముందీ! డబ్బుగురించే... డబ్బు లేనివాడు మనిషీ కాడు. డబ్బులేని మనుష్యులు చావడానికన్నా మరో మార్గంలేదు.

సీత : పోనీ యాభైరూపాయిలిస్తే నీకిచ్చేజీతంలో మినహాయించుకునేవారుగా.

సూర్యం: ఉద్యోగం ఊడిపోయి మూల కూర్చుంటే, ఇంకా జీతమేమిటి?

సీత : ఈ వేళ కాకపోతే రేపెక్కడైనా దొరుకుతుంది గా బస్... కండక్టరయిన తర్వాత ఇక మూలనే కూర్చుంటావా? నాన్న రోగం చూస్తే...

సూర్యం: ప్రస్తుతం మనం బ్రతికే ఆధారమేలేదు. పోతేనాన్న జబ్బు బాగుపడ్డం గురించి యెవరు బాధపడతారు చెల్లాయ్! మనం సరిగా తిని యెన్నాళ్ళయింది?

సీత : మనతెంసి ఆ తరువాత మాట. పుట్టెడు రోగంతో నాన్న మంచ మెక్కాడు ... కాళ్ళుపడిపోయాయి ... మాటరాదు. .... ఏదో చెప్పాలనుకుంటాడు ... చెప్పలేడు. ..ఊరికే చూస్తాడు ... మనలో యెవరికన్నా రోగం వస్తే అలా వూరుకోగలడా ... మనలో యెవరన్నా చావడానికి సిద్ధంగావుంటే. ..

సూర్యం: చెల్లాయ్! నాకు బాధలేదనుకోబోకు. నాన్ననూ చూస్తుంటే నాగుండెలు తరుక్కుపోతున్నాయ్ ... — ఏంచేయను ... ఏవో ఊహాలు ఊహించుకున్న నా జీవితం గతిలేక కారు కండక్టరుగా చేరాల్సినంతదుస్థితి పట్టించిది ... వెధవ ఉద్యోగం. ప్రతి పోలీసుకు పెద్ద నేరం చేసిన వాడిలా చేతులు నలపాలి ... ఓవర్ లోడ్ చేయాలని ఓనరుగ్గోల ... తీరా చేస్తే పోలీసు స్టేషను చుట్టూతిరగడం, లైసెన్సు ఊడిపోవడం.... నాన్న ఒక గుమస్తాగా జీవితాన్నంతా శ్రమించి ఆరంగనాధానికి బొజ్జపెంచాడు, డబ్బాపెంచాడు ... తన బ్రతుకుతోపాటు బిడ్డల జీవితాల్నికూడా నాశనం చేశాడు.

సీత : అన్నయ్యా!

సూర్యం: నేను చచ్చేవరకూ ఇలా వుంటాను. నాకేంపర్వా లేదు, కాని నీకు ?

సీత : ఏమిటది ?

సూర్యం: నీకు పెళ్ళయ్యే మార్గంలేదు.

సీత : (తల వంచుకుంటుంది.)

సూర్యం: ఆ ! రంగడేడి ?

సీత : అలా వెళ్లాడు.

సూర్యం: వాడి జీవితానికి దారి తెన్నూ లేదు. చదువుకోవల సిన రోజులలో రోడ్డు దుమ్ములో సైకిలెక్కి- పేపర్లు అమ్ముకుంటున్నాడు. వస్తులతో మాడుతున్నాడు. ఇంతనీచమైన స్థితికి రావడానికి కారణమెవరు? నాన్న కదూ?

సీత : కాదు.

సూర్యం: కాదూ?

సీత : ఎందుకన్నాయ్! చచ్చేనాన్నమీద ఆకక్ష... నాన్న సంపాదించినంత కాలం ఆడబ్బు మన సంసారానికే సరిపోలేదు ...రంగడి గురించి ఆలోచిస్తున్నావు కాని నీపనేమయింది—— పూర్తిగా చదువుకునుంటే కండ క్టరు కావల్సినంతగ తేంపట్టిందినీకు. నాన్న చేసింది గవర్నమెంటువారి గుమాస్తాకాదు, అవసానకాలంలో పెన్షన్ యివ్వడానికి—ఆఖరిదశలో ఆధారంలేకుండా, మనచేతా మనచేతా మాటలు పడుతున్నాడు.

సూర్యం: ఈపరిస్థితుల్లో ఆరంగనాథం సాయంచేయడంధర్మం కదూ?

సీత : అది నాన్న తప్పెలా అవుతుంది? పైగా నాన్నఒక్కడే కాదుగా అలా గుమాస్తా పనిచేసింది—అనేక వేల మందిలో నాన్న ఒక్కడు.

సూర్యం: ఏళ్ళ ఆతీపతీ తీసుకునేవాళ్ళేలేరు. వీళ్ళ అవుసరం కూడా బహు తక్కువమందికి ఉంటుంది. జీవితపుఆఖరి దశలో జాగర్త లేని ప్రతిషావుకారు గుమాస్తాబ్రతుకూ యింతే! మళ్ళీ పెద్ద న్యాయంగా సంచరించాలను కుంటూనే ఓ ప్రక్కను అన్యాయంగా ఆషావుకార్లకు ఆస్థులు గడించి పెడతా రీ గుమాస్తాలు.

[రంగడు బిందెతో వస్తాడు]

సీత : ఏమయిందిరా?

రంగ : ఎవరూ ఇవ్వలేదక్కా.

సూర్యం: మంచినీళ్ళు పోసుకునే బిందెకూడా తాకట్టుకు పంపించావన్నమాట.

సీత : ఔను నీఒక్కడి గురించేకాదు. మనందరి గురించీ పంపించాను.

సూర్యం: వెధవ బ్రతుకులై పోయాయ్ (లోపలకు వెడతాడు)

రంగ: పిచ్చియ్యతాత రూపాయకు పావలా అయితే యిస్తానన్నాడక్కా.

సీత : ఒక నెలకు రూపాయకు పావలా వడ్డీయే!

రంగ: అదైనా మనకు కాబట్టి యిస్తానన్నాడు. బంగారమైతే అణా అట— వెండయితే బేడట.

సీత : ఇత్తడికాబట్టి పావలా—పోనీ సుబ్బమ్మగారి దగ్గరకు వెళ్ళలేకపోయావా?

రంగ : అబ్బో! వెళ్ళాను. పెట్లో దాచుకునేవయితే తాకట్టు పెడతానంది. ఆమె మొగుడూరుకోడట, బిందెలూ, పాత్రలూ కనపడితే.

సీత : పోనీ మీ ఏజంటు పంతులుగారి దగ్గరకు వెళితే...

రంగ : వెధవ అయిదు రూపాయలకోసం బిందె పట్టుకుని ఊరంతా తిరగాలంటావ్? నేను వెళ్ళనక్కా.

సీత : రంగా! నాయనవుకదూ! పోనీ పావలా అయినా సరే... వెళ్ళు, పిచ్చయ్యతాత దగ్గరకే వెళ్ళిపట్టుకురా.

రంగ: నేను వెళ్ళలేనక్కా.

సీత : నామాట వినవూ రంగా.

రంగ : (బాధగా విసుగ్గా బిందె పట్టుకుని) పేపర్లమ్ముకునేవేళ యిపోయింది. పంతులుగారు చూస్తే కోప్పడతారు, వెళ్ళకపోతే నువ్వూరుకోవు.

[సూర్యం లోపలనుంచి వస్తాడు]

సూర్యం: రంగా! బిందె లోపలపెట్టు.

సీత : ఏమిటన్నాయ్ అది?

సూర్యం: పీనుగుమీద కూటికాసించే వెధవల దగ్గర కెళ్ళొద్దు. మాడి మనం చస్తుంటే రూపాయకు పావలాలు, బేడలూ వడ్డీలు !

సీత : మన అవుసరం కొద్దీ వెళ్ళుతున్నాం. వాళ్ళనుతిట్టు కొంటే ఏం లాభం?

సూర్యం : లాభంలేదు కాబట్టే వెళ్ళొద్దంటున్నాను.

సీత : మరిరోజు భోజనం?

సూర్యం : గడిచిపోయిన రెండు రోజుల్లాగా గడిపేద్దాం. అంతగా లేకపోతే మాడిచద్దాం.

సీత : లోతలకు పట్టుకెళ్ళరా రంగా!

[రంగడు లోపలకు వెళతాడు. సీత వెళ్ళి చీపురు తీసుకుంటుంది.]

సూర్యం : చెల్లాయ్!

సీత : ఎందుకు?

సూర్యం: నువ్వాలా చేయడం బావుందా!

సీత : ఏం చేశాను?

సూర్యం: నలుగుర్లో నేనిక తలెత్తి తిరగనక్కర్లేదూ? ఆఖరికి బిందెకూడా తాకట్టు పెట్టేస్తున్నావంటే నాకు చిన్నతనం కదూ?

సీత : అన్నాయ్! నీకు చిన్నతనంగా ఉందా? చిన్నతనం

గానే ఉంటుందిలే, కాని మనం ఆకలి బాధతో మాడే దానికన్నా, నాన్న రోగానికి మందుకూడా యిప్పించ లేని దుర్గతికన్నా యిందేం చిన్నతనం కాదు—మనకీ పనికొత్తకూడా కాదుగా! నా చెవ్వుల కమలాలు, చేతిగాజులు, వడ్డీలు కట్టలేక విసిచి పెట్టేసుకున్న సంగతి మర్చిపోయి ఉంటావనుకుంటా.

[రంగడు లోపలనుంచి పేపర్ల కట్టతో వస్తాడు]

రంగ: కుండలో ఎక్కడా అన్నం కనుపించదేం అక్కా?

సూర్యం: రామ! రామ! ఈలాంటి బ్రతుకు బ్రతికేదానికన్నా చావడం మంచిది.

[లోపలకు వెడతాడు]

సీత: లేనిది ఎక్కడ కనుపిస్తుంది?

రంగ: కనుపించదు—మాడే కడుపుతో ఎంతదూరం సైకిలు త్రొక్కను!

సీత: పంతులుగార్నడిగి డబ్బేమన్నా తీసుకరాలేకపోయావ్వా!

రంగ: తెస్తే కూర్చుని తింటారు.

సీత: నువ్వు తెచ్చే జీతం మరి మాటలా?

రంగ: ఎంతో కొంత తెస్తున్నాను—తిండిలేకపోతే ఈ ఎండలో మాడి చచ్చిపోవాలి.

సీత : మాటిమాటికీ చావాలనేమాట తెస్తే వీపు చిట్లి గొడతాను, వెధవా !

రంగ : నేను అన్నం తినకుండా అసలు సైకిల్ ఎక్కేఎక్కను.

[సూర్యం లోపలినుంచి వస్తాడు]

సూర్యం: రంగా ఏమిట్రా అది?

[రంగడు మౌనం]

సీత : వాడినెత్తి.

రంగ : ఇదుగో అక్కా! ఎందుకని వూరుకుంటూన్నాను.

సీత : లేకపోతే.

రంగ : నన్నట్టే వాగించకు.

సూర్యం: పేపర్లన్నీ అలా పడేస్తే ఎవరమ్ముతారు?

రంగ : ఏమో!

సూర్యం: ఈ రోజు పేపరు ఈ రోజు అమ్మకపోతే రేపెవ్వరూ తీసుకోంటారూ అంట!

రంగ : ఏం చెయ్యాను అన్నయ్యా? రాత్రిపాచిపోయినఅన్నం కాసింత పెట్టింది అక్క.

సీత : అసలు నువ్వు బిందె ఎందుకు తీసుకెళ్ళావో ఆమాత్రం జ్ఞానంలేదట్రా... అన్నయ్యా. నిన్నపొద్దుటనుంచీఅసలు అన్నం ముట్టేడా!

రంగ : ఆఁ!

సూర్యం: వారం పదిరోజులునుంచి సీత సరిగా అన్నం తింటోందట్రా?

రంగ : తినటల్లేదూ! రోజూ నేను కాస్తో కూస్తో అన్నం తింటూంటే మీరుకూడా తింటున్నారనుకున్నాను.

[పేపర్లు కారియర్ మీాద సదురుకుంటూంటాడు.

సూర్యం: పంతులుగారికెంత యివ్వాలిరా జీతం?

రంగ : నేనే యివ్వాలి ఆయనకు అయిదురూపాయలు.

సీత : మొన్ననేగా మనకే రెండురూపాయలు యివ్వాలని చెప్పావ్?

రంగ : ఆకలేస్తుంటే అప్పీ యిప్పీ తినేసి అప్పు పడిపోయానక్కా.

సీత : గడ్డి తినలేకపోయావ్.

రంగ : మరి అక్కోయ్;

సూర్యం: నోర్ముయ్. కారుదిగిపోయి పదిహేనురోజులయింది, యింట్లో గింజలు లేవు... నాన్న చూస్తేచావు బ్రతుకులమీాద ఉన్నాడు. ఆ మాత్రం బుద్ధిలేదురా నీకు.

సీత : మనిషయితే ఉండేది.

రంగ: ఇకపైన వచ్చేజీతం యింట్లోకే తెస్తాలే అన్నయ్యా... ఇంకేదన్నా తింటే వొట్టు.

[తాడుకోసం లోపలకు వెళతాడు]

సీత : అబద్ధ మాడకుండా ఒక్క రోజుండ లేదు.

సూర్యం: వాణ్ణేమనకు చెల్లాయ్.

సీత : అంటే లాభ మేలేదు. నాలుగు చురకలు తగిలించాలి. అంతవరకూ బుద్ధిరాదు.

సూర్యం: చెల్లాయ్!

సీత : నీగారమే వాణ్ణి అలా తయారుచేసింది. నువ్వు గట్టిగా కసురుకుంటే అలా చేయగలుగుతాడా!

సూర్యం: వాడల్లాతయారుకావడం వాడితప్పుకాదుచెల్లాయ్. ఆనందంగా, ఆడుతూ, పాడుతూ ఉండేరోజులు... చీకూ, చింతా లేకుండా సంతోషంగా ఉండవలసిన వయస్సు... అప్పుడేవాడికిసంసార బాధ్యత ... సాధింపు లూను. ఏ మొగం పెట్టుకొని వాణ్ణి గదుముతావాలో చెప్పు చెల్లాయ్!

[రంగడు తాడుతో వస్తాడు]

రంగ : ఇదిగో. నా గురించి ఎవ్వరూ బాధపడొద్దు... ఈవేళ ఏదో విధంగా డబ్బు తెస్తాను. లేకపోతే చస్తాను.

సూర్యం: రంగా!

సీత : ఏమిట్రా ఆ మాటలు.

రంగ : ఆ – ఏమిటి అంతలోనే అలాగన్నారు. ఓ! అదా! చస్తానంటే నిజంగా తెస్తానన్నమాట..

సూర్యం: (లాలనగా) వెధవమాటలు.

రంగ : అవునన్నయ్యా నాకు బుద్ధుండొద్దూ? నాన్న వైద్యానికి ఏభై రూపాయలు కావాలి. పంతులుగారిచ్చే జీతం అసలు ఎందుకూ సరిపోదనుకో... పోనీ అదైనా యింట్లో పడేస్తే బావుండేదిగా. అసలు ఆ పంతులుగారిచ్చే రెండూ మూడూ ఇంటికి తీసుకొద్దామనే జేబులో వేసుకుంటాను... సైకిలుమీద తిరగడంకదూ. దాహమేస్తుంది. సోడాకొట్టు దగ్గర కెళతాను. అంతాకలర్సు తాగేస్తుంటే నాకుసోడాతాగబుద్ధే పుట్టదన్నాయ్... కలరే తాగేస్తాను. తీరా తాగిన తర్వాత అరణాలు ఊడేస్తాడు. ఆ ఉన్న డబ్బులైనా యింటికి తీసుకొద్దామనుకుంటే కాఫీ హోటల్ జ్ఞాపకం వస్తుంది... హోటల్లోకి వెళతా....బీరువాలో లడ్లూ, బల్ల మీద యిడ్లీలు, తినకూడదను కుంటూనే, అడిగి తినేస్తానన్నాయ్... తరువాత కాఫీ... బైటకు వచ్చి చూచుకొంటే జేబుకాళీ. ఈజబ్బు పోవడమెలాగో తెలీదు. ఇదుగో అన్నయ్యా! ఈరోజు నేను పది రూపాయలు తెస్తాను. నువ్వెంత తెస్తావో చూస్తాను... వైద్యుడు శంకరంగారి కొంటిచ్చి ...యింట్లోకి బియ్యం, పప్పూ, ఉప్పూ, అన్నీ కొనేద్దాం.

సూర్యం: (ఆనందంగా) నిజమేనురా రంగా?

రంగ : అబద్ధమనేది నీదగ్గర ఆడలేనుగా అన్నాయ్.

సీత : నాదగ్గరైతే...

రంగ : అలవాటయిపోయింది మరి.

[సైకిలు తీసుకెళ్ళబోతూంటే పిచ్చయ్యతాత ఎదురువస్తాడు]

రంగ : (ఆగి) ఆఁ, అనుకున్నపని అయినట్లే.

పిచ్చి : ఏం... నే నెదురొచ్చాననా! నా ఎదురు బంగారం! నేనూ బతికిచెడ్డోణ్ణి బుల్లోడా.

రంగ : నీ కూతురు!

సీత : ఒరే రంగా.

పిచ్చి : ఆ మాటన్నావంటే నా వొల్లు మండుద్ది బుల్లోడా.

రంగ : చన్నీళ్ళు పోసుకోతాతా.

సూర్యం: నీకాక్కాదురా చెబుతుందీ.

రంగ : పిచ్చయ్యతాతా! నీ కూతురు రాజుతో కులుకుతోందిలే.

[సైకిలెక్కి వెళ్ళిపోతాడు]

పిచ్చి : సూశావా బుల్లోడా! బతికి చెడ్డోణ్ణి ఎంతెంత మాటలనేస్తున్నాడో.

సీత : చిన్నతనం కదూ తెలీదులే తాతా.

పిచ్చి : నాకూతురు పేరెత్తేరంటే ఏమైతే అయ్యేది. పాణాలు తీసేస్తాను... ఆ చెడిపోయింది నాకూతురేంటి!

సీత : నీ కూతురుకాని దే....'నాకూతురు పేరెత్తితే' అంటా వేమిటి పిచ్చియ్యతాతా?

పిచ్చి : కూతురే! చెడిపోయింది. చెడిపోయిందాన్ని కూతురనంటానేంటి?

సూర్యం: ఏమంటావ్?

పిచ్చి : ఏదోఅంటాను. అదంతా నీ కనవసరం. దానిపేరెత్తితేఒళ్లు మండుకుపోద్ది. అసలు బతికి చెడ్డోణ్ణి! మా వంశంలో మచ్చేలేదు కితం.

సీత : ఏదో డబ్బుతోతులతూగి పోతుందటగా. నువ్వింకా యిలా తిరగడం ఎందుకు?

పిచ్చి : మళ్ళీ జన్మలోదానిముఖంసూత్తాన్టా!

సూర్యం: పిచ్చియ్యతాతా కోప్పడకు....ఎప్పుడన్నా రమ్మనమని కబురు పెట్టిందా?

పిచ్చి : ఓ! లచ్చసార్లు కబురు పెట్టింది. నేనెల్తానేంటి? నేను బతికిచెడ్డోణ్ణి.

సీత : అప్పుడప్పుడూ తినటానికి యేదో పంపిస్తూ ఉంటుందటగా?

పిచ్చి : ఎవరు సెప్పారు? ఆళ్ళపేణం తీసేత్తాను.

సూర్యం : ఏదో ఒకటి రెండుసార్లు పంపించింది. పంపిస్తే మాత్రం అలా చెప్పకోవచ్చేమిటి!

పిచ్చి : అద్దిగదీ! పంపించింది— పంపిత్తే బతికిచెడ్డోణ్ణి రెండు మిఠాయుండలకన్నా ఎక్కువతీసుకున్నానేంటి!

[సూర్యం, సీత నవ్వుతారు.]

పిచ్చి : నవ్వితే నాకొల్లు మండుద్ది. బతికిచెడ్డోణ్ణి కాబట్టి చెప్పలేక చెప్పాను.

[సీత లోపలికి వెడుతుంది; సత్యం, భుజంమీద టేపుతో చేతులోకత్తెరతో కాస్త మంచిదుస్తులే వేసుకుని వస్తాడు]

సత్యం : నీ బతుకు చెడిందిలే.

పిచ్చి : మీరనుకుట్టు సత్తెమా?

సత్యం : మరే!

పిచ్చి : పని బాగా సాగుతోందా బుల్లోడా?

సత్యం: నా పనికేంలెద్దు. నీ వడ్డీవ్యాపారం ఏలాగుంది?

పిచ్చి : ఇదేంటి బుల్లోడా! ఎవరన్నావడ్డీకి పెట్టమని పంపిత్తే తెత్తాను. ఏదో బతికిచెడ్డోణ్ణి నాదగ్గరెక్కడిదీ!

సత్యం : మీ అమ్మాయి చెడి బాగానే బ్రతుకుతోందిగా!

పిచ్చి : నాదగ్గ రామాట ఎత్తొద్దు బుల్లోడా!

సత్యం : ఏం చాటుమాటు నందుకుంటున్నావుగా పాతికాపర కానూ!

పిచ్చి : ఎవరు సెప్పేరేంటి?

సత్యం : మీ అమ్మాయే.

పిచ్చి : దాని పేణం తీసేత్తాను. బతికిచెడ్డోణ్ణి. మాటంటే పడను తెలుసా?

సూర్యం : ఎందుకులే సత్యం పిచ్చియ్యతాతతో.

సత్యం : బ్రతికి చెడ్డోడట! కన్నూమిన్నూ కానకుండా ఉన్న రోజుల్లో డబ్బంతా వెధవహోదాలకు, మేర్యానీలకూ, తగలేసి చెట్టుపేరు చెప్పుకొని కాయలమ్ముకుంటూ న్నట్లు ఈ బాపతువారి మనుష్యులందరకూ, "బతికి చెడ్డోళ్ళం" యిధొక పెద్ద అలవాటయి పోయింది. పైగా ఉన్నది ఉన్నట్లుగా మాట్లాడ్డం వీళ్ళకు చేత గాదు. కాస్తో కూస్తో ఆ కూతురు దగ్గర ఒకముక్క తింటూ వుంటాడు; పైగా తిడుతూ ఉంటాడు.

పిచ్చి : బతికిచెడ్డోణ్ణి కాబట్టి నాకాబాధ. దానిదగ్గర డబ్బు తీసుకుంటున్నానంటే లోకులేమనుకుంటారు బుల్లోడా!

సూర్యం: అసలు తీసుకుంటున్నావా?

పిచ్చి: అది తర్వాతమాట. పంచాయితీబోర్డు లెంబరు చేశాను నువ్వెరుగుదువా? నోరడిపోయింది కానిమీ బాబు సెప్పేవోడు దానికి సాచ్చీకం – రంగనాధ మున్నాడే– ఆడూ సెడి బతికినోడే. అళ్ళవాబు ఏం చేశాడో తెలుసా? కిరస్తానీ ఓళ్ళదగ్గర నౌకరు. ఆ రంగనాధాన్ని మీ బాబేగా గుమాత్తాగా వుండి శాగు చేసింది. మిసనుకుట్టే సత్తెం మాత్రం బతికిచెడ్డోడే.

సత్యం: ఆ మాటే అనొద్దంటున్నాను.

[సీత వస్తుంది]

పిచ్చి :ముక్కు చివరుంటుంది కోపం... ఏవమ్మో సీతమ్మో సత్తాన్ని మాత్రం పెళ్ళిచేసుకోబోకు - మీబాబుకు సేద్దామని వుందిలే, ఆ సంగతి నోరున్నప్పుడు నాతో సెప్పేడు.

సత్యం: నువ్వు వెళతావా వెళ్ళవా?

పిచ్చి: బతికి చెడ్డోణ్ని అలా అనకూడదు బుల్లోడా.

సత్యం: ఆ మాట మళ్లీ అను!

పిచ్చి: బాగానేవుంది-ఏమిటమ్మో ఈ మిడిసిపాటు.

[వెళ్ళిపోతాడు]

సూర్యం: సత్యమంటే పిచ్చియ్యాతాతకు భయమే.

సత్యం: ఈ లాంటి వెధవల్ని చూస్తే నాకు భలేమంట - కూతురికి చిన్నప్పుడే పెళ్ళిచేసి దాని గొంతుకోశాడు. వెధవ ముండవని యింట్లో కూర్చోబెట్టాడు. సంపాదనలేదు. గతంలో గొప్పని చెప్పుకుంటూ గాలికి బతికే రకం.

సీత : పెద్ద కబుర్లు చెపుతావ్ కాని ఆ పిల్ల చేసిన పని తప్పు కాదేమిటి?

సత్యం: ఏమీ తప్పులేదంటాను.

సూర్యం: వ్యభిచారం చేసేవాళ్ళంటే నీ కిష్టమనుకుంటాను.

సత్యం: వ్యభిచారాన్ని సమర్థించను.

సీత : నీమాటలకు అర్థం?

సూర్యం: అది వాడికే తెలీదు.

సత్యం: ఒకమనిషి తప్పును మనం చెప్పుకొనేటప్పుడు ఆ తప్పు ఏపరిస్థితుల్లో చేయాల్సి వచ్చిందో ముందుగా ఆలోచించాలి. ఈపిచ్చియ్యతాత జబ్బుపడ్డాడు. తండ్రి కోసం కాంతం ఆ పని చేసింది. చేస్తున్నదని వాడికి తెలుసు, అయితే ఇరుగుపొరుక్కి తెలియలేదనే ధైర్యంతో చూసీ చూడనట్టు వూరుకున్నాడు. ఆ అవకాశాన్ని ఆధారంగా చేసుకుని మరీ బహిరంగంగా తిరగటం మొదలెట్టింది. వూరంతా ఒక్కసారే గుప్పుమంది. అప్పుడే ఒళ్ళు మండింది పిచ్చియ్యతాతకు. మొగుడు కొట్టినందుకు ఏడవలేదట, తోటికోడలు దెప్పినందుకు ఏడ్చిందట. ఆ సామ్యంగా వుంది, పిచ్చియ్యతాత బతుకు.

సీత : ఏది ఏమైనప్పటికీ ఆ పిల్ల ఆపని చేయటం తప్పు కదూ?

సూర్యం: నీతిఅనేది మర్చిపోయిన వాళ్ళు అది తప్పులేదని చెప్పడంలో కూడా తప్పు లేదులే.

సత్యం: నేనుచేసేది మిషను పనైనా పుస్తకాలు చదవడానికి నీకన్నా నాకే ఎక్కువ అవకాశం. మీయిద్దరికీ తెలుసు అని అనుకునే దానికన్నా నాకు ఎక్కువ తెలుసు. ఆ మాట మీరుకూడా ఒప్పుకుంటారు.

సూర్యం: ఇంతకూ దాన్నేమంటారు?

సీత : పతివ్రత అంటారు.

సత్యం: ఆమె భర్తుండి, బ్రతకడానికి తిండుంటే ఈపురాణాల్లో చెప్పే పతివ్రతల లాగునే శీలవతే కావచ్చంటాను.

సూర్యం: ఆమె చేసిన పనిపేరు?

సత్యం: సమాజం ఆమెకు చేసినద్రోహం.

సీత : ఈ మధ్య రాజకీయ పుస్తకాలు చదువుతున్నాడల్లే వుంది.

సూర్యం: కాదు,ఇతరదేశాల పుస్తకాలు తెలుగు భాషలో కూడా రాస్తున్నారులే. బహుశా అవి చదివి ఉంటాడు.

సత్యం: కావచ్చు...ఇతర దేశాలతో మనదేశాన్ని పోలిస్తే చాలా సంవత్సరాలు వెనకున్నాం మనం. పది సంవత్సరాలు ముందుకు పోవడానికి ముందుగా చేసే ప్రయత్నం ఫలితం పొందాలంటాను. ఆశయాలు

అపారంగా వుండి ఆచరణ అల్పమైతే అసలు ఆ దర్శమే శూన్యమౌతుంది.

సీత : ఎవరితో మాట్లాడుతున్నావ్?

సత్యం: మీ యిద్దరితో!

సూర్యం: ఏదో గోడతో మాట్లాడుతున్నావని మా చెల్లాయ్ అడిగింది లే.

సత్యం: మీరిద్దరూ గోడలనే భావం మీ కేవుంటే నే నింత వరకూ మాట్లాడటం అనవసరమని అనుకుంటాను.

సీత : మాటలనేర్పు బాగానేవుంది సత్యానికి.

సూర్యం: పదిళ్ళు తిరుగుతూ, పదిమందితో ఎప్పుడూ వాగే వాడికి మాటలన్నా సంపాయించకపోతే...

సత్యం: మాటలు సంపాదిస్తామా! మంచిమాటన్నావురా! మాటంటూ వుంటే మీకు కలిగిన కష్టంలో కాస్త పాలైనా పంచుకోకుండా వుంటానా?

సీత : (లోపలకువెళ్ళి చూసివచ్చి కంగారుగా) అన్నయ్యా! అన్నయ్యా! నాన్నఒళ్ళంతా చల్లబడి పోయింది.

[కంగారుగా సూర్యం లోపలకు వెళతాడు. సత్యం గుమ్మంలో నిలబడతాడు. సీత వెలుపలకువచ్చి పిచ్చిగా వీధిలోకి వెళ్ళబోతోంది.]

సత్యం : ఎక్కడికి సీతా?

సీత : వైద్యుడు శంకరంగారి దగ్గిరికి.

సత్యం: డబ్బులేనిదే ఎలాగొస్తాడు?

సీత : ఔను సత్యం. ఇంతవరకూ ఎంతో సాయం చేశావ్... అన్నయ్యకు నౌకరీ వూడిపోయింది. నాన్న రోగం ముంచుకొస్తూ వుంది... ఎలా అడగాలో నాకూ నోరు రావడంలేదు. ఏభై రూపాయలు కావాలి...

సత్యం: ఎందుకూ?

సీత : శంకరంగారు కావాలన్నారు.

సత్యం: ఏభై రూపాయలే!

సీత : ఔను.

సత్యం: వాడిదగ్గరున్న మంసులన్నీ అమ్మినా ఏభై రూపాయల ఖరీదుండవ్.... యాభై రూపాయలడిగేడా!

[సూర్యం లోపలినుంచి వస్తాడు; సత్యం లోపలకు వెళతాడు]

సీత : ఎలాగుంది?

సూర్యం: ప్రాణంపోలేదు... పోదుకూడా.

సీత : అవేం మాటలన్నాయ్!

సూర్యం: నేనలా వెళ్ళొస్తాను.

సీత : ఎక్కడికి?

సూర్యం: డబ్బుకోసం.

సీత : ఎవరి దగ్గరకు?

సూర్యం: నాన్నకు ఈదుస్థితిని కలిగించిన వాడెవడో వాడి దగ్గరికే.

సీత : రంగనాథం దగ్గరికా ?

సూర్యం: ఔను.

సీత : అసలు అతన్ని చూడ్డానికి అవకాశం వుంటుందా?

సూర్యం: అవకాశాన్ని కలిగించుకుంటాను. అడ్డొచ్చేవాళ్లు ఎవరన్నావుంటే ఆవలకు నెట్టుతాను.

సీత: అన్నాయ్!

[సత్యం లోపలనుంచి వస్తాడు.]

సూర్యం: గుండెలమీద గుద్ది మాట్లాడిస్తాను. న్యాయానికీ శిక్ష ఎందుకో, ధర్మానికింత దగాదేనికో అడుగుతాను.

సత్యం: సమాధానం చెప్పకపోతే?

సూర్యం: చావగొడతాను.

సత్యం: అంతలో మీ నాన్న ఆరోగ్యవంతుడౌతాడు.

సూర్యం: సత్యం!

సత్యం: సత్యమే చెప్పాను.

సూర్యం: నువ్వు అబద్ధమే చెపుతున్నావ్! అన్యాయాలను సమర్థిస్తున్నావ్.

సత్యం: నన్నింతవరకే అర్థంచేసుకున్నావ్.

సూర్యం: అర్థంకాదు... యథార్థంకూడా అంతే.

సత్యం: అయితే వెళ్ళిరా!

సూర్యం: నీ సలహాను నేను కోరలేదు.

సత్యం: సంతోషం.

సూర్యం: సంతోషం... మాగురించిఎవ్వరూవిచారించరు... అందరికీ సంతోషమే. అంతామమ్మల్ని విరోధులుగా, హీనులుగా దరిద్రులుగా చూస్తారు. దూరంగా తప్పు కుంటారు. నువ్వుకూడా వాళ్ళల్లోచేరిపోయావ్... నా నౌకరీతోపాటు నాస్నేహితులు కూడా పోయారు... వాళ్ళని అప్పడుగుతానని అదురుగా చూస్తూ ప్రక్క దార్లని పోతున్నారు... నువ్వు కూడా వెళ్ళిపో. మా యింట్లోంచి వెళ్ళిపో.

సీత : (కంగారుగా) ఏమిటన్నాయ్ అది... ఏమంటున్నావ్! సత్యాన్ని వెళ్ళిపొమ్మంటున్నావా. అతను చేసిన సహాయాలకు యిదేనా నువ్వు అనవలసినమాట. మన గురించి అతను అనేకమందికి అప్పుపడ్డాడు... అతనికి మనం అప్పుపడ్డాం... ఇది స్నేహంలో అనవలసిన మాటేనా!

సత్యం: నీకా కంగారెందుకు సీతా? వాడీ కష్టసమయంలో నన్ననక ఎవర్నంటాడు. చాలినంత సహాయం నేను

చేయలేకపోయిన మాట నిజమే. చేయాలని నాకుంది. చేతికి మాత్రం అందటంలేదు నావృత్తే అలాంటిది.

సీత : ఏమీ అనుకోబోకు సత్యం. అన్నయ్యా మనస్సు పాడైపోయింది.

సత్యం : ఏమన్నా డబ్బుకోసం ప్రయత్నిస్తాను. వాడన్నందుకు బాధపడ్డంలేదు... మీ పరిస్థితులకు సిగ్గుపడుతున్నాను. వెడతారా సూర్యం.

[వెళ్ళబోతాడు]

సూర్యం: (కళ్ళనీళ్ళతో) సత్యం!

[సత్యం వెనక్కు తిరుగుతాడు]

సూర్యం: (కౌగలించుకుని, తలవంచుకుని) ఏదో అన్నాను. ఎదుకన్నానో నాకే తెలీదు. క్షమించు.

సత్యం: సూర్యం!

సూర్యం: మా నాన్నకు రోగం... ఇంట్లో బియ్యపుగింజలేదు. రంగడు కడుపులో ఆకలితో కళ్ళుతిరుగుతున్నాయంటూనే సైకిలెక్కి వెళ్ళాడు... మా చెల్లాయి రెండురోజులయింది అన్నంతిని... ఏదో విధంగాడబ్బు తేవాలి... ఎక్కడికన్నా వెళ్ళి తేవాలి.

[అని విసుగ్గాబైటకు వెళతాడు]

సత్యం: సీతా!

సీత : ఏం?

సత్యం: నేనుకూడా యింటికివెళ్ళి యిప్పుడే వస్తాను.

సీత : ఎందుకూ?

సత్యం: అజ్జీ వూరికెనే.

సీత : సత్యం! నీ సంగతి నాకు తెలుసు...అప్పుచేసి మిషన్ కొన్నావు. ఆ అప్పు అలాగే వుండిపోయింది.

[శంకరం వస్తాడు. వేషం డాంబికంగానే వుంటుంది.]

శంక : ఏలా వుందమ్మాయ్?

సీత : శంకరం గారా!

శంక : మీకు శ్రద్ధలేకపోయినా ఆ రోగిగురించి నాకన్నా శ్రద్ధ వుండాలిగా...తీరా చేయి చేసుకున్నాను... పోతే పోతాడులే అని మీలాగా ధైర్యం చేసుకుని నేను కూడా కూర్చుంటే...

సీత : శంకరంగారూ! అలా అనొద్దు.

శంక : ఏమనాలి? రెండురోజులయింది నేను వచ్చి. కాస్తంత మందుకోసమన్నా కబురు పంపేవా?

సీత : డబ్బెక్కడా అందలేదండీ.

శంక : అందదని నాకు తెలుసు...వైద్యుడంటే అసలే అందదు. అసలువైద్యమే అలాఅయిపోయింది. పైగా అందరూ వైద్యులే అయిపోయారు.

సత్యం: మీలాగే.

శంక : నావైద్యాన్ని నువ్వు పరీక్ష చేయగలవా?

సత్యం: మీరు వేసైన పరీక్షింటూ ఒకటుంటేగా.

శంక : మా ముత్తాత వైద్యుడు. మా తాత వైద్యుడు. నేను వైద్యుణ్ణి. మా కుటుంబమంతా వైద్యులమే. మాది అనుభవ పూర్వకమైన వైద్యం.

సత్యం: ఆ పేరు చెప్పుకునే సుఖంగా నైవేద్య మారగిస్తు న్నారు.

శంక : తలబిరుసుగా మాట్లాడుతున్నావే!

సత్యం: దానికేమన్నా వైద్యమున్నదాండీ?

సీత : అతనితో ఏమిటిరండి, ఒక్కసారిచూసి వెళ్లురుగాని.

శంక : చూసి వెళ్ళకపోతే ఇతని మాటలు వింటూ కూర్చుం టూనా ఏమిటి?

[లోపలకు వెళ్తాడు. తిరిగి సీతతో వస్తాడు.]

సీత : ఎలాగున్నదండీ?

శంక : ఏలా వుంటుంది!

సత్యం: డబ్బుకావాలంటూంది నాడి.

శంక : (కోపంగా) సత్యం!

సత్యం: గంతకుతగ్గ బొంతలాగ వాళ్ళబతుక్కి మీలాంటి మహామహావైద్యుడు బయల్దేరాడు... ఏభై రూపాయ లిస్తే ఆయన ఆరోగ్యం కుదటపడుతుందా?

శంక : అనే చేస్తాం. ఆ పైన భగవంతుడికృప.

సత్యం: ఆమాత్రం భరోసా లేనప్పుడు డబ్బడగటమెందుకూ?

శంక : మందులు పైనుంచి మాకువ్వారికే రావటంలేదు.

సత్యం: మందులు పైనుంచికూడా తెప్పిస్తున్నారా మీారు?

సీత : ఎందుకు సత్యం వారితోనీకు.

శంక : వైరివాణ్ణనుకుంటున్నాడేమో?

సత్యం: మిమ్మల్ని వైరివాడనుకునేవాడు వైరివాడు. మొన్న క్రొత్తగా డాక్టేరూ. ఇట్లాసంపాదించేనా?

శంక : ఓ! నీబతుకే చెప్పాలి. వెధవ మిామనుకొయ్యకుట్టు కుంటూ?

సత్యం: ఒక్కమాట అడుగుతున్నాను కోప్పడకండి.

శంక : నీకసమాధానం చెప్పాల్సినంత అవసరం నాకులేదు.

సత్యం: మీాఅవసరం మాకుంది ప్రభూ! ఆయనను రోగం యేమిటి?

శంక : పక్షవాతం!

సత్యం: ఎందుకొచ్చింది?

శంక : అనారోగ్యం వల్లే.

సత్యం: అనారోగ్యానికికారణం?

శంక : ఆహార విహారాలు.

సత్యం: సరైన అహార విహారాలు కావాలంటే?

శకం : ఏమిటీ చొప్పదంటు ప్రశ్నలూ?

సత్యం: అలాగే అనుకోండి. కాని ఒక్క ప్రార్థన. వాళ్లు పేద వాళ్ళు. డబ్బుంటే సరైన తిండి వుంటుంది. తిండి లేక పోవడం ద్వారానే ఈరోగం వచ్చిందని తమకు తెలుసు. తెలుసుండికూడా మళ్ళీ మీరే ఆ డబ్బు గురించి వాళ్ళను ఒత్తిడిచెయ్యడం ఏమన్నా బాగుం దంటారా?

శంక : ఊరికే చెయ్యాలంటావ్?

సత్యం: తమరు చేసేది ఆయుర్వేద వైద్యమనుకుంటాను. బహుశా మీరు ఆ గ్రంథాలు పరిశీలించి వుంటే—

శంక : పరిశీలించ కుండానే వైద్యం చేస్తున్నానా?

సత్యం: అదెవరు చూచారులెండి. తాతలు, ముత్తాతలూ, చేసిన మందులున్నాయని చేస్తే చేయవచ్చు కూడా- కాని భారతదేశం గర్వించదగ్గ ఆయుర్వేదానికి...

శంక : నేను కళంకం తెస్తున్నానంటావ్.

సత్యం: అనడమేమిటి-కనిపిస్తుంటే!

శంక : ఏమిటి-కనిపించేది?

సత్యం: మీ దుర్మార్గం.

శంక : జాగ్రత్తగా మాట్లాడు.

సత్యం: మీరు అజాగ్రత్తగా వైద్యం చేయడంవల్లనే యింత వరకూ ముంచుకొచ్చింది. జబ్బు తెలియకుండా మందు వెయ్యటం, ఆ మందు పరిశీలిస్తే రేవడిమట్టి కావటం.

శంక : నీ సంగతి నేను కనుక్కుంటాను.

సత్యం: ఆ సంగతి తెలుసుకుందామనే నేనూచూస్తున్నాను.

శంక : నీ వల్ల చేతనయ్యేది ఏమన్నావుంటే చెయ్యి.

[వెళ్ళబోతాడు]

సత్యం: ఆగండి. వెళ్ళారా మీ మర్యాద దక్కదు. ప్రభుత్వపు పట్టాలేకుండా మీరు వైద్యం చేశారు. ఒక జీవితాన్ని నాశనం చేయటానికి సిద్ధమయ్యారు. పూర్తిగా తగ్గిస్తారా వాళ్లకు వుచితంగా వైద్యంచేసి మీరుచేసిన లోపానికి క్షమార్పణ కోరుకోండి. లేదా ఆరోగికి ఏలాంటి యిబ్బంది కలిగినా మీపైన కేసు పెడతాను.

[సత్యం వెడతాడు; సీత లోపలనుంచి వస్తుంది.]

సీత : వెళ్లిపోయాడండి—సత్యం.

శంక : వెళ్లాడు.

సీత : ఏమిటాలోచిస్తున్నారు ?

శంక : సత్యంతో అలా చెప్పిస్తే మీకు ఉచితంగా వైద్యం చేస్తానని మీరంతా ఆలోచించారా!

సీత : సత్యంతో ఆ విషయం గురించి అసలు మాట్లాడనే లేదండీ.

శంక : మాట్లాడందే వాడలా అడగటానికి అవసరమేమిటి?

[రంగడొస్తాడు.]

రంగ : శంకరంగారొచ్చారా అక్కా! ఇదిగో.

[పది రూపాయలనోటు చూపిస్తాడు]

సీత : ఎక్కడిది రంగా?

రంగ: ఎక్కడిదో తర్వాత చెపుతాలే. శంకరంగారూ! ఈ పది రూపాయిలూ తీసుకోండి.

[శంకరం అందుకుంటాడు.]

సీత : ముందు మందు యిప్పించండి తర్వాత మా అన్నయ్యేమన్నా తెస్తే...

రంగ : రండి శంకరంగారూ! నేను వస్తాను. నా చేతికివ్వండి మందు.

సీత : మరొక్క సారి చూస్తారా మా నాన్నను?

శంక : చూశానుగా యింకఅక్కర్లేదు. రారా రంగా!

[రంగడు, శంకరం వెళతారు; సీత లోపలకు వెళుతుంది. వెలుపలినుంచి "సూర్యం ..." అనే పిలుపు వినిపిస్తుంది. సీతగుమ్మంలోంచి వస్తుంది.]

సీత : ఎవరు?

పంతు: (వెలుపలనుంచే) మీ అన్నయ్య లేడూ?

సీత : పంతులుగారా!

[పంతులు వస్తాడు.]

పంతు : ఔను. రంగడెక్కడ?

సీత : ఇప్పుడే మందుకోసం వెళ్ళాడు. మా నాన్నకు చాలా ఎక్కువగా వుందండీ!

పంతు: మీ అన్నయ్య ఉన్నాడా?

సీత : లేడు.

పంతు: ఎక్కడకెళ్ళాడు?

సీత : డబ్బుకోసం తిరుగుతున్నాడు.

పంతు: రంగడుకూడా అందుకోసమే తంటాలు పడుతున్నట్లున్నాడు.

సీత : కుర్రాడు—వాడికెవరిస్తారు?

పంతు: ఇవ్వకపోయినా ఏదోవిధంగా తీసుకురావచ్చుగా—

సీత : మీరనేమాట నాకర్థంకావటంలేదు.

పంతు: అర్థంకాదు. అర్థమయ్యేటట్లు నేనుచేస్తాను. (అని వెళ్ళపోతాడు.)

సీత : పంతులుగారూ!

పంతు: మీ అన్నయ్యా, నేనూ చిన్నప్పుడు ఒకే స్కూల్లో చదువుకున్నాం.

సీత : ఔను.

పంతు: ఆ పరిచయం వల్లే రంగడికి పేపర్మిల్లో ఉద్యోగం యిచ్చాను.

సీత : కాదని ఎవరన్నారు?

పంతు: అందరికీ నెలకు పన్నెండు రూపాయలిస్తున్నా. వీడికి పదిహేను రూపాయలిస్తున్నాను.

సీత : మంచిపనే చేశారు. మీరింతకూ చెప్పేది?

పంతు: అది మీ అన్నయ్యకు చెప్పి చేద్దామనుకున్నాను. లేడుగా... చెప్పకుండానే చేస్తాను.

సీత : అదేమిటో నాతో చెప్పకూడదూ?

పంతు: నా పేరు పంతులు. ఈ పట్టణంలో నన్నెరగని వాళ్ళు లేరు. ఆఖరికి రంగనాథంగారు కూడా నేను చెప్పినంతా చేసితీరుతాడు.

సీత : ఇవన్నీ యిప్పుడెందుకండీ?

పంతు: గవర్నమెంటులో కూడా నాకు పలుకుబడి వృ-ది ఫైలునా!

సీత : ఉంచే ...మీ మాటలేమిటో నాకు అర్థం కావటం లేదు.

పంతు: వట్టి పేపర్ల ఏజంటు వెధవగా చూస్తున్నారేమో.

సీత : మా అన్నయ్య వచ్చేక మాట్లాడుదురు గాని... వెళ్ళండి.

పంతు: మర్యాదగానే మాట్లాడుతున్నావా?

సీత : పంతులుగారూ! ఒకటి రెండుసార్లు మీరు మా యింటికివస్తే చూడ్డమేకానీ, కారణం చెప్పకుండా యింత ఎక్కువగా మాట్లాడతారని నాకు తెలీదు. తెలుసుంటే మీతో యింతవరకూ మాట్లాడేదాన్ని కాదు. వెళ్ళిరండి నాకు పని వుంది. (అని వెళుతూ వుంటుంది)

పంతు: కాస్సేపటికి పోలీసులువస్తారు.

సీత : ఎందుకూ?

పంతు: మీ రంగణ్ణి స్టేషన్‌కు తీసుకువెళ్ళడానికి.

సీత : ఏంచేశాడని?

పంతు: వాళ్ళే చెబుతారు. వచ్చిన దగ్గరనుంచీ వెళ్ళు వెళ్ళు అంటున్నావు. ఇక్కడ నీతో వుండటానికి రాలేదు.

సీత : (కంగారుపడి కోపంగాచూచి) పంతులుగారూ!

పంతు: రంగడు నా సైకిలు చోరీ చేశాడు.

సీత : ఏమిటీ?

పంతు: తాకట్టుపెట్టి డబ్బు తీసుకొచ్చాడు.

సీత : ఎప్పుడు?

పంతు: అరగంటకు ముందు... ఎంత తెలియనట్లు మాట్లాడు తున్నావ్. ఆ డబ్బు తీసుకొచ్చి నీ కివ్వలేదూ?

సీత : పదిరూపాయలు పట్టుకొచ్చాడు.

పంతు: ఎక్కడదనుకున్నావ్?

సీత : మీదగ్గర అప్పుగా తీసుకొచ్చాడనుకున్నాను పంతులు గారూ! క్షమించండి. మా నాన్నకు రోగం ఎక్కువయింది. వైద్యం చేయించటానికి డబ్బులేదు. రంగడిది చిన్నవయస్సే అయినా యింట్లో యిబ్బంది వాడ్నే పని చేయించి వుంటుంది. అది మా తప్పుగా భావించండి. వాడినేం చెయ్యొద్దు. వాడే చెమటోడ్చి, మీ ఋణాన్ని తీర్చుకుంటాడు... లేదా అన్నయ్యే డబ్బిచ్చి ఆ సైకిలు తీసుకొచ్చి మీ కిస్తాడు.

[సత్యం మెల్లగా వస్తాడు.]

పంతు: అసలు నేను మొండివెధవని. ఏదైనా పని తలపెట్టనే తలపెట్టను. తలచానా తప్పనిసరిగా జరిగితీరాల్సిందే.

సత్యం: పంతులుగారూ! ఏమిటది?

పంతు: పంతులంటే ఎట్లాంటి మనిషో నీకూ తెలుసు.

సత్యం: తెలిస్తే ?

పంతు: అమ్మాయీ, నేను వెళ్తున్నా... మీ అన్నయ్య వచ్చిన తర్వాత నేనువచ్చి వెళ్లానని చెప్పు.

సీత : ఎక్కడికెడతారు మీరు ?

పంతు: రిపోర్టు యివ్వటానికి.

సత్యం: ఎవరిమీద ?

సీత : రంగడు పొరపాటుపని చేశాడు. వీరి సైకిలు తాకట్టు పెట్టి పదిరూపాయలు తెచ్చాడు.

సత్యం: ఇంతేనా? ఇంకేమిటో పెద్ద పొరపాటు చేశాడనుకున్నాను.

పంతు: ఇది పొరపాటుకాదూ?

సత్యం: వాళ్ళ గ్రహపాటునుబట్టి మీరు పొరపాటనుకున్నారు. వాడు చేసిన పని పెద్ద తప్పేంకాదు. సొమ్మవసరం గురించి ఆ సైకిలు అడ్డం పెట్టుకున్నాడు... అంతే.

పంతు: వాడి సొమ్మా?

సత్యం: లేకపోతే, వాడు శ్రమించి సంపాదించి ఒకళ్ళదగ్గర అప్పనంగా నిలవేస్తున్న బాపతులో కొద్దిమాత్రం సొమ్ము. దానికి పెద్దగొడవ చేస్తారెందుకూ? పంతులు గారూ! రంగడు మీ దగ్గరచేరి రెండు సంవత్సరాలవుతుంది. అప్పటినుంచీ సైకిలు వాడి అదుపాజ్ఞల్లో నే

వుంటోంది. ప్రతిరోజూ దాన్ని ఎక్కి త్రొక్కుతూ దానికి చాలా శ్రమ యిచ్చాడు. మీ అవసరానికి దాన్ని ఆధారంగా తీసుకుని అనేకరోజులు తొక్కి కష్టించినప్పుడు ... రంగడవసరానికి మీ రడ్డుపడక పోయినా వెధవది యినుపముక్క, అదికూడా ఆ మాత్రం సహాయం చేయలేకపోతే ఎలాచెప్పండి?

పంతు: నువ్వు మొండిగా మాట్లాడుతున్నావు. వాడి సొత్తని కాస్సేపన్నావ్. ఏదో నాదగ్గర అప్పనంగా నిలవేసిన బాపతని మరోసారన్నావ్. ఆఖరికి వెధవ యినుప ముక్క నాకన్నా వాడికి ఎక్కువ సహాయం చేసిం దంటున్నావ్.

సత్యం: కోప్పడకండి. కన్నతండ్రి కష్టదశలోవున్నాడు. ఏదో విధంగా కాపాడుకోవలసిన భాధ్యత ఆ కుర్రాడికుంది. న్యాయంగా అడిగితే మీరివ్వకపోవచ్చు. అందుకే ఆ కుర్రాడు ఆ ధైర్యం చేశాడు. వాడి దుస్థితిని తెలుసు కున్న మీకు ఏ మాత్రం హృదయమున్నాయీపరిస్థి తులలో మీరు వాళ్ళ యింటిమీదకుయుద్ధానికీరారు.

పంతు: ఏమోయ్ సత్యం! పరిచయాన్ని మించి ఎక్కువగా మాట్లాడుతున్నావు. పంతులంటే నీకు ఎక్కువగా తెలిసుంటే ఇలా మాట్లాడవ్.

సత్యం: ఎందుకు తెలీదు బాబూ! తెలుసు ... పొరపాటున రైలు పట్టాలు లాగడానికి ప్రయత్నిస్తూ పోలీసువారికి దొరి

కారు. అదృష్టవశాత్తు జైలునివాసం దొరికింది. అది ఆధారంగా ఖద్దరుకట్టి, ఆనాటినుంచీ కనుతున్నారు. ఆపలుకుబడితోనే రెండుదినపత్రికలకు ఏజంటయ్యారు. ఆ జైలు సర్టిఫికేటుతో అయాచితంగా అందినవి అయిదు ఎకరాలు. లోపాయి కారిగా చిన్న నల్ల వ్యాపారం. పైకి దేశభక్తుడుగా చలామణీ అయిపోతు న్నారు. పంతులుగారికి నేనొక్కడినే వల మేమిటీ బాగా ఎరుగుదును.

పంతు: సంతోషించాంలే!

సత్యం: మీ సంతోషానికి చాలామంది విచారిస్తారు.

పంతు: నోరు కట్టాలి.

సత్యం: తమరుకూడా ఆ పనే చెయ్యాలి.

పంతు: చేస్తాను. చేయాలనే చేస్తాను. ఏ అమ్మాయి; నేను వెళ్తున్నాను.

సీత : ఎందుకండీ?

పంతు: తరువాత విచారించినా లాభంలేదు.

సీత : మీరుచేసే ప్రయత్నం మానరా?

పంతు: తప్పని సరిగా పోలీసు రిపోర్టు యిస్తాను.

సత్యం: ఏమని యిస్తారు?

పంతు: దొంగతనం చేశాడని.

సత్యం: వాడిమీద రిపోర్టు యివ్వటానికి వీల్లేదు.

పంతు: నువ్వు అడ్డు పడతావా?

సత్యం: అవసరంవస్తే.

పంతు: అయితే సరే! (వెళ్ళబోతాడు)

సత్యం: పంతులుగారూ!

పంతు: ఏం?

సత్యం: రిపోర్టు చేస్తారా?

పంతు: అవును.

సత్యం: దేనికి?

పంతు: డబ్బు రాబట్టుకోటానికి రిపోర్టు అవసరం కాబట్టి.

సత్యం: రిపోర్టు లేకుండానే డబ్బు వస్తే?

పంతు: ఏ గొడవా లేదు.

సత్యం: (జేబులోంచి పదిరూపాయలనోటు తీసి) అయితే యిదుగో.

[పంతులు ఆశ్చర్యంగా చూస్తాడు.]

సత్యం: తీసుకోండి, కాని వాడు నేరస్తుడనుకోవద్దు. పరిస్థితులు వాణ్ణి అలా చేయించాయి... అది కారణంగా వాడి నౌకరీ లేకుండా చేయటం మంచిపనికాదు.

[రంగడు మందుసీసాతో వస్తాడు; పంతుల్ని చూసి మందు సీసా విసుస్తాడు. మందు ఒలికిపోతుంది. సీసా పగిలిపోతుంది.]

సీత : ఆఁ !...(ఆశ్చర్యంగా చూస్తుంది.)

రంగ : (కళ్ళనీళ్ళతో) చెయ్యి జారిపోయిందక్కా.

సీత : (పెంకులు ఏరుతూ) ఇన్నిపాట్లు పడింది యీ మందు కోసమే. ఒక్క బొట్టుకూడా మిగల్లేదు.

సత్యం: పంతులుగార్ని చూసి భయపడినట్లున్నాడు.

పంతు: ఏరా రంగా! ఏం పనిచేశావ్?

సీత : ఇంకా ఎందుకులెండి? మీ డబ్బు మీకు ముట్టిందిగా, యిక వెళ్ళండి.

పంతు: వెళ్తాను; కాని రంగడిక నా కొట్టుదగ్గరకు రానడా నికి వీల్లేదు.

సీత : పంతులుగారూ! ఈ పని మీకు ధర్మంగా లేదు. ఈ కష్టకాలంలో మీరుకూడా వాడికి నౌకరీ లేకుండా చేస్తే మేం బతకలేం. మేము చావడమే మీ దేశ భక్తికి నిదర్శనమైతే వాడికి నౌకరీ తీసేయండి. పేద వాళ్ళను మరీ మాడ్చి చంపడమే మీ కిష్టమయితే వాడిని రావద్దనండి.

పంతు: సరే! సైకిలు మాత్రం యిక యివ్వను. నడిచి వేపక్లు మ్మకునే మాటైతే రావచ్చును.

[పంతులు వెడతాడు.]

సీత : నీకు బుద్ధిలేదురా? అలాంటి వెధవపనిచేసి నాన్న కోసం పదిరూపాయలు తీసుకొస్తావ్రా? ఆ డబ్బుతో నాన్న ఆరోగ్యవంతుడైతే మాత్రం, ఇలా జరిగిందని తెలిసిన తర్వాత బతకడానికి యిష్టపడతాడా? పది రూపాయలు తెస్తానన్నావయ్యా, అని వెధవకబుర్లు చెప్పడం ఈ దొంగతనం చేయడానికేనా?

రంగ : నేను దొంగతనం చేయలేదు.

సీత : ఈ చేసినపని?

రంగ. దొంగతనం కాదు.

సీత : నోర్మూయ్ (దవడమీద కొడుతుంది.)

పత్ర్యం: సీతా, వాడు నీ గురించి చేయలేదు. ఈ పనికి దొంగతనమని పేరు పెడతారని తెలిసి వాడు చెయ్యలేదు. ప్రపంచంలో డబ్బును కాపాడ్డం కోసం పెట్టిన నియమాలు వాడి చిన్న మెదడుకు ఇంకా అర్థంకాలేదు.

సీత : (కళ్లనీళ్లతో) రంగా! ఎప్పుడూ కొట్టలేదు. పొరపాటున చెయిజారింది.

రంగ: (ఏడుస్తూ) అక్కా కొట్టినందుకు బాధపడటంలేదు. నేను దొంగతనం చేయలేదు. బిందె పట్టుకొని తాకట్టు కోసం యిల్లిల్లూ తిరిగాను, ఎవరూ యివ్వలేదు నీకు తెలుసు. ఈ సైకిలన్నా పెడితే యిస్తారేమోనని సైకిల్ షాపు దగ్గరకు వెళ్లాను. నాలుగు రోజులు

వాయిదా పెట్టి వెళ్లిచ్చారు. ఇక యిలాంటిపని ఎప్పుడూ చేయనక్కా. (మందుకేసి చూస్తూ) ఇంతా తెచ్చినమందు నేలపాలు చేశాను.

సత్యం: ఫరవాలేదు. శంకరంగారితో చేయి జారిందని చెప్పి మళ్ళీ మందు తీసుకురా.

రంగ: ఇస్తాడా ?

సత్యం: ఇస్తాడు. లేకపోతే నేను వస్తానని చెప్పు.

రంగ: ఔను; నువ్వంటే భయం. తప్పకుండా యిస్తాడు. అక్కా మందు పట్టుకొస్తాను, మరొక సీసావుందా?

[సీత లోపలకు వెడుతుంది.]

రంగ: అక్క చాలా మంచిది. మూడు రోజులనుంచీ అక్కకు అన్నంలేదు. అన్నయ్యకూడా తిండిలేదు.

సత్యం: నువ్వు ?

రంగ: నేను రాత్రి కొంచం తిన్నాను.

[సీత సీసా తీసుకువస్తుంది.]

రంగ: నీరసంగా వుందా అక్కా?

సీత : లేదు.

రంగ: నన్ను కొట్టినందుకు బాధపడుతున్నావా?

సీత : అదీకాదు.

రంగ: నాన్నకోసమా ?

సీత : అబ్బ నన్ను ఊరికే వాగించకు—వెళ్ళు రంగా.

[రంగడు సీసా తీసుకువెళ్తాడు]

సత్యం: ఏమి టాలోచిస్తున్నావ్?

సీత : ఏమీలేదు.

సత్యం: నేను తెచ్చిన డబ్బును గురించా?

సీత : ఎందుకు ఆత్మస్తుతి! చాలా గొప్పపని చేశావుగా?

సత్యం: పంతులు కిచ్చాననా?

సీత : పంతులు కిచ్చినందుకాదు. అసలు ఎందుకు తీసుకొచ్చావు డబ్బు...నిన్నెవరు తీసుకురమ్మన్నారు?

[సత్యం నవ్వుతాడు.]

సీత : ఎందుకు నవ్వుతావ్?

సత్యం: ఇది సంతోషంతో నవ్వుకాదు; వాడిపోయిన నవ్వు.

సీత : కవిత్వం చెప్పకు.

సత్యం: నిజం;సీతా! తేవలసినంతా తేలేకపోయాను. తెచ్చింది కూడా దుర్వినియోగం అయిపోయింది.

సీత : ఎందుకు తీసుకురావాలని నేనడుగుతున్నాను?

సత్యం: చన్నీళ్ళకు వేడినీళ్ళు సాయంగా మీ కష్టాన్ని కొంత ఆదుకోవాలని.

సీత : ఆ అవ్వసరం నీకెందుకు?

సత్యం: కొత్తగా మాట్లాడుతున్నావే?

సీత : లేదు.

సత్యం: ఇదివరకెప్పుడూ అనలేదే?

సీత : ఇదివరకు కూడా తీసుకొచ్చానని మరోసారి చెబుతున్నావన్న మాట.

సత్యం: సీతా !

సీత : ఔను... సత్యం! మేము సగం చచ్చి బ్రతుకుతున్నాం. నీ సహాయం మమ్మల్ని పూర్తిగా చంపుతుంది. నువ్వు నన్ను బ్రతికుండగానే చంపాలంటే నువ్వు చచ్చి, చెడి, అందుగురించి కొందర్ని బాధపెట్టి డబ్బు తీసుకురా.

సత్యం: సీతా! కష్టపడేవాళ్ళకు సహాయపడ్డం కనీస మానవ ధర్మం. ఆ ఉద్దేశ్యంతోనే నేను...

సీత : తనకు మాలిన ధర్మం చేస్తున్నావ్.

సత్యం: నేను ఎక్కువ కష్టపడి యీ డబ్బు తెస్తున్నట్లుగా భావించి నువ్వు బాధపడుతున్నావ్.

సీత : కాదు.

సత్యం: కావచ్చు కాని, ఒకరోజుకు మించి మా కుటుంబం ఎప్పుడూ పస్తుపడలేదు... రెండు మూడు రోజులు వస్తూ

సగా తిండి లేకుండా మాడిపోయే వాళ్ళను గురించి ఒక రోజు ఉపవాసం చేయడంకూడా మాకు పెద్ద శాస్త్రైన పనికాదు. ఆ పదిరూపాయలూ మీ తిండికోసం ప్రప యోగ పడతాయని తెచ్చాను.

[చలపతి వస్తాడు]

చల : పాపం నేను రానడంవల్ల మీకు ఏమీ అభ్యంతరం లేదుకదా !

సీత : చలపతిగారా? కూర్చోండి.

చల : కూర్చోడానికి రాలేదు. పాపం మీ నాన్నను ఒక్క సారి చూచి వెడదామని వచ్చాను.

సత్యం: ఎంతకాలానికి 'పాపం' రామయ్యమీద దయకలిగింది!!

చల : ఎవరూ? హైలకు సత్యమా! ఏమిటోయ్! నీ గురించి వూరంతా చెప్పుకుంటున్నారు బ్రహ్మాండంగా.

సత్యం: అల్లరివాడిననా?

చల : పాపం ఎంతమాట; చాలా తెలివైన వాడవని చెబు తారు. ఉపన్యాసాలుకూడా దంచేస్తావట.

సత్యం: కష్టపడి జీవించేవాళ్ళు ఉపన్యాసాలకు, విలువేముం దీ రోజుల్లో. వాళ్లు బ్రతికి జీవించటల్లే దిప్పుడు.

చల : ఇప్పుడు చచ్చిపోయినవాళ్ళెవరు?

సత్యం: స్వాతంత్ర్య ఫాలాలు కలవాళ్లు.

చల : స్వతంత్రం వచ్చాకకూడా చాలా తీవ్రంగా మాట్లాడు తున్నావే!

సత్యం: ఏదో తమలాంటి వారికి ఈ స్వతంత్రం మంచి అవ కాశమే యిచ్చింది.

చల : నేనుకూడా ఒకచోట నీలాంటి నౌకర్నైగా—నా కవ కాశ మొచ్చేదేమిటి!

సత్యం: రంగనాథంగారికి మీరు జనరల్ మేనేజరు.

చల : అయితే.

సత్యం: మీరే రంగనాథం, రంగనాథమే మీరు; మీరుచెప్పి నట్లు ఆయన చేయవలసిందే. అసలు చేసేదంతా మీరే. నామ్‌కేవాస్తే ఆయన.

చల : ఏమిటో పాపం అంతా అలా అనుకుంటారు. (సీతతో) ఏలా వుందమ్మాయ్!

సీత : లోపలకువచ్చి చూడండి.

చల : అసలు ఏమన్నా మాట్లాడేనా! పాపం !

సీత : మాటలు పడిపోయి వారంరోజు లయిందండి!

చల : అరె! పాపం! కూర్చోవడంగాని లేవడంగాని...!

సీత : ఏమీలేదు.

చల : ఆహారంకూడా.

సత్యం: మీ దయవల్ల పాపం అతనికేకాదు... ఈ యింట్లో వాళ్ళకుకూడా వారం రోజులనుంచీ దాని దర్శనమే దొరకటం లేదు.

చల : ఎంతమాట పాపం... సూర్యం నాకీ విషయంలో చెప్పనేలేదే?

సీత : మీతో చెప్పానన్నాడే?

సత్యం: బహుశా, మర్చిపోతూ ఉండొచ్చువీరు.

చల : ఆ... ఒక్కపనా వల్లకాదా. నెల్లాళ్ళనుంచి యిక్కడికి వద్దామని ప్రయత్నం—ఈ రోజుకు తీరిక్కలిగింది.

సత్యం: ఔను పాపం!

చల : (కోపంగాచూసి) వెళతాను సీతా!

సీత : (సత్యంతో ఏమీ అనొద్దని సౌజ్ఞచేసి) కూర్చోండి.

సత్యం: నేనే వెళతాలెండి (వెళతాడు.)

చల : పాపం! ఇతను చాలా అమాయకంగా కనిపిస్తాడే, మీ కేమన్నా ...

సీత : కావలసినవాడే-దూరపు బంధువు.

చల : పాపం... మంచివాడే అనుకో. ఆ మంచితనం, తెలియని వాళ్ళదగ్గర చాలా చెడ్డగా తయారవుతుంది. రంగ జేడి?

సీత : నాన్న మందుకోసం వెళ్ళాడు.

చల : పాపం–మీ అన్నయ్యనుచూస్తే నాకు జాలివేస్తుంది.

సీత : ఏదో–ఆ లైసెన్సు తెప్పించండి.

చల : నా చేతిలోవుంటే యింతవరకూనా, అయినా ఓవర్ లోడ్ చేయమని ఎవరు చెప్పారు?

సీత : మీరే చెప్పారటగా!

చల : ఇదొకటా పైగా! పాపం ఏదో కండక్టరూ, డ్రైవరూ పైడబ్బులకోసం పాటుపడ్డం... శృతిమించివస్తే అదిగో చలపతిగారు చేయించారనడం. అయినా సీతా! సూర్యం అంత కోపిష్టి మనిషేమిటే? పాపం నా మీద కేకలు వేశాడు. నేనుమాట్లాడకుండా వూరుకున్నాను. నేను శాంతాన్ని జాగ్రత్తగా కాపాడుకునే మనిషిని. ఆ మాటలు రంగనాథంగారిదగ్గర సాగుతాయా?

సీత : రంగనాథంగార్ని మాఅన్నయ్య ఏమన్నా అన్నాడా!

చల : ఏం జరిగిందో ఏమో? ఒక పావుగంట క్రితమే పాపం సూర్యాన్ని పనిలోంచి బర్తరఫ్ చేయమని కబురు పెట్టారు. ఆయన మాటంటే శిలాక్షరం. ఆయన ఉప్పూ, పులుసూ తింటున్నాం. అయినా సల్ప వృత్తాన్ని దగ్గర పెట్టుకొని మరీ కష్టాలు పడుతున్నారంటే; పాపం చాలా విచారించవలసిందే! మీ నాన్న రామయ్య అంటే ఆయనకు ఎంతో అభి

మానం... అందు కేగా నా సిఫారుసు అక్కర్లేకుండా నే సూర్యానికి ఉద్యోగం దొరికింది.

సీత : మీ రేదోవిధంగా చెప్పి ఉద్యోగాన్ని నిలబెట్టండి.

చల : నా సంగతి నీకు చాలా తక్కువ తెలుసు. పాపం నా చేతికిందుగా ఈనాడు నాలుగు వందలమంది పని వాళ్లు బ్రతుకు తున్నారు. కాని చలపతి కఠినుడని ఏ ఒక్కడూ అనలేదు. ఇదుగో అమ్మాయి, నువ్వు రంగనాథంగార్ని ఎప్పుడైనా చూశావా?

సీత : చిన్నప్పుడొకసారి వాళ్ళింటికి వెళ్ళాను. అప్పుడు చూచిన జ్ఞాపకం.

చల : అదీ... ఆయన హృదయంలో ముద్రపడిపోయావ్.

సీత : ఆఁ...

చల : అబ్బే! ఏదైనా మీనాన్న ప్రస్తావన వచ్చినప్పుడు సీత వుంది, బావుందా! ఇదీ ప్రశ్న ... ఏమిటో నువ్వంటే రంగనాథంగారికి ఆ ప్రేమా, ఆదయ... అరె! ఆయన సున్నితమైన నోటితో దేవుణ్ణి తలచ డానికి కూడా సిగ్గుపడతాడు. మనిషిది ఎంత అంద మైన విగ్రహం. మాట మాట్లాడితే ఏదో ముత్యాల మోత క్రింద వుంటుంది. అనేకమంది ఆయన దర్శనంకోసం ఈ నాటివరకూ తహతహలాడుతూ రంటే నమ్ము.

సీత : ఎందుకు చెబుతున్నా రిదంతా?

చల : పాపం పసిదానవు నీకేం తెలుస్తుంది.

సీత : తెలియాల్సిం దేమిటి?

చల : ఆయన తత్వం.

సీత : నాకు ఆ అవసరమేమీ కనుపించదే!

చల : మీ అవస్థలే ఆ అవసరాన్ని కలిపిస్తాయేమో?

సీత : నన్నేం చేయమంటారు?

చల : నువ్వు ఏది చేయి—ఏదీ చేయకపో, నాకదంతా అనవసరం. మీ కష్టాలు తీరాలంటే ఒక్కసారి రంగనాథంగార్ని చూడటం మంచిదంటాను. దేవుడికూడా దర్శన మివ్వడు. నీ గురించి ద్వారాలన్నీ తెరుస్తాడు.

సీత : అలాగా. అయితే;

[రంగడు మందుతో వస్తాడు]

చల : ఎలా కనుపిస్తారనా సందేహం—నేనున్నానుగా.

రంగ : చలపతిగారా! పాపం!

చల : వెళతానమ్మాయి.

సీత : మంచిదండీ...కాని మా అన్నయ్య పనిగురించి...

చల : నేను చెప్పిందే మంత్రం.

సీత : నేను వెళ్ళలేనండి——

చల : పాపం! పిచ్చిమనస్సు.

రంగ : ఎక్కడికక్కా?

సీత : రంగనాథంగారితో మాట్లాడటానికి.

రంగ : ఎవరెళ్ళమన్నారు?

సీత : చలపతిగారే.

రంగ : నువ్వాక్కడకు వెళ్ళావంటే అన్నయ్య ప్రాణం తీసేస్తాడు.

సీత : ఏం?

చల : కుర్రతనం పాపం!

రంగ : పాపం! మీది పెద్దతనం.

చల : ఏం... వెళ్తే?

రంగ : పొగరుబోతు.

చల : తెలివితక్కువగా మాట్లాడుతున్నావ్.

రంగ : ముండల ముఠాకోరు.

చల : (కోపంగా) రంగా!

[రంగడు లోపలకు వెళతాడు]

సీత : చలపతిగారూ!

చల : ఇది కోపంకాదు... నాకు కోపంలేనేలేదు... బిగ్గరగా అన్నానంతే. పాపం! డబ్బుకలవాళ్ళు మంచివాళ్ళ

యినా, చెడ్డగానే అనుకుంటుందిగా ప్రపంచం. (వెడతాడు.)

[లోపలినుంచి రంగడు "అక్కా" అని పిలుస్తాడు]

సీత : ఏం? (లోపలకు వెళుతుంది)

[లోపలినుంచి రంగ, సీతా, "నాన్నా!" "నాన్నా!" అనిఅంటారు. రంగడు కళ్ళునులుపుకుంటూ వచ్చిబల్ల మీద కూర్చుంటాడు. సీత నెమ్మదిగావస్తుంది]

సీత : రంగా! మళ్ళీఒకసారి వెళ్ళి శంకరంగార్ని తీసుకురా.

రంగ : వస్తాడంటావా అక్కా?

సీత : వస్తాడురంగా-రాకపోతే కాళ్ళుపట్టుకొని బ్రతిమాలు. ఆపదకాలంలో ఏదన్నా చేయాలి. వెళ్ళు.

రంగ : ఏమని చెప్పితీసుకురానూ?

సీత : ఏమని చెబుతావ్? చూస్తున్నకళ్ళుమూసుకుపోయినా యని చెప్పు ... కంఠంలోకఫంఎదురుతిరిగిందని చెప్పు ... కాళ్ళూ, చేతులూ, చల్లబడ్డాయని చెప్పు. ఇక బ్రతుక డేమోనని చెప్పు.

[సత్యం లోపలకు వెళతాడు]

రంగ : (ఏడుస్తూ) అక్కా!

సీత : వెళ్ళురంగా.

[రంగడు వెడతాడు, సత్యంలోపలనుంచి వస్తాడు]

సీత : ఎలా వుంది సత్యం?

సత్యం: చచ్చేవరకూ ఏంభయంలేదు.

సీత : అవేంమాటలు సత్యం!

సత్యం: ఔను సీతా! ఈ కరువురోజుల్లో యింకా అతను బ్రతకాలని కోరుకోవడం దేనికి?

సీత : అన్నయ్య ఎక్కడికెళ్ళాడో యింకా రాలేదు. మతిపోయినట్లు తిరుగుతున్నాడు ...ఎటుతిరిగి ఏంచేస్తాడో భయంగావుంది.

సత్యం: ఏంచేస్తాడు.

సీత : ప్రాణానికి తెగిస్తాడేమో!

సత్యం: మిమ్మలనందర్ని విడిచి ఆపనిచేయలేడేమోలే.

[సూర్యం వెలుపలినుంచి వస్తాడు]

సీత : అన్నయ్యా!నాన్నకు బాగా ఎక్కువగావుందిచూడు.

[సూర్యం మాటలాడడు]

సీత : అన్నయ్యా!

సూర్యం: ఈనరకబాధ నేను పడలేను...చూసి మాత్రం ఏంచేస్తాను! చేతిలో కానీలేని చేతకాని వెధవనై పోయాను.

సత్యం: అం. బానిసన్నా అన్యాయంగా తయారయ్యావ్.

సూర్యం: అబ్బ కబుర్లుచెప్పకు. నాస్థానంలో నువ్వుంటే అలా చెప్పలేవు! రా చెల్లాయ్.

[సీత, సూర్యం, లోపలకు వెళతారు.. పిచ్చియ్యతాత వస్తాడు.]

పిచ్చి: రామయ్య కేలావుంది బాబూ! రంగడేమిటో కంగా రుగా పరుగెత్తుకెల్తున్నాడు.

సత్యం: కాస్త ఎక్కువగానేఉంది.

పిచ్చి: పాపం! బ్రతికిచెడ్డోడు.

సత్యం: పదిరూపాయలు అప్పు తెచ్చిపెడతావా తాతా.

పిచ్చి: నీకా! అయ్యో. బ్రతికి చెడ్డోణ్ణి ఏడిపించటానికి కాక పోతే నాదగ్గర డబ్బు ఎక్కడిది బాబూ.

సత్యం: వడ్డీలకు తిప్పుతున్నావటగా?

పిచ్చి: ఎవరు చెప్పారు?

సత్యం: చెప్పినాళ్ళు ఎవరైతేనేం! నేనెగేస్తానని భయమా?

పిచ్చి: అయ్యో! రామ! పెమాణకంగా నాకా అనుమానం లేదబ్బాయా. అయినా నాదగ్గరెక్కడిదీ? ఎవరన్నా ఏదన్నావస్తువుమీద డబ్బివ్వమని యిత్తారు. వస్తువు లేందే ఎవరిత్తా రబ్బాయా.

సత్యం: చేబదులుగా ఇవ్వలేవూ?

పిచ్చి : నాసామ్మొకాదుగా. బతికిచెడ్డోడిచేత ఎందుకబ్బాయా లేదనిపిస్తావ్.

సత్యం: ఇదిగో పిచ్చియ్యతాతా! నేను మంచిగా అడుగుతు న్నానను యిస్తావా, ఇయ్యవా?

పిచ్చి : ఇదేంటబ్బాయో, కోపంగా అడుగు తున్నావ్.

సత్యం : (దగ్గిరగా వస్తాడు) పిచ్చియ్య తాతా! రామయ్య నీ స్నేహితుడు. రామయ్య బిడ్డలువీళ్లు...వాళ్ళకు రెండు రోజులనుంచీ భోజనంలేదు. ఇంకో రోజు గడిస్తే వాళ్లు మనతో మాట్లాడలేరు. పదిరూపాయ లివ్వు. నన్ను హామీగా పెట్టుకో. వారం రోజుల్లో నీ ఋణాన్ని తీరుస్తాను.

పిచ్చి : నాదగ్గిరెక్కడిదబ్బాయ్. వత్తాను.

[పోబోతాడు, సత్యంపట్టుకుంటాడు.]

సత్యం: ఆగు!

పిచ్చి : సత్తెమా!

సత్యం: అంత భయపడతావేమిటి?

పిచ్చి : ఔటోణ్ణి నన్నేంచేయకు బాబూ.

సత్యం: (ఉంగరం తీస్తూ) పిచ్చియ్యతాతా! వస్తువు మీాద యిస్తావుగా?

పిచ్చి : బతికి చెడ్డోణ్ణి నా సంగతి నీకు తెలుసు. నా దగ్గ రెక్కడుంటాది బాబూ...ఎవరినన్నా అడుగుతాను.

సత్యం: ఈ ఉంగరం తీసుకుపోయి పదిరూపాయలు పట్టుకురా.

[పిచ్చియ్య ఉంగరం తీసుకుని చూస్తుంటాడు.]

సత్యం: వడ్డీ ఎంత?

పిచ్చి: రూపాయకు నెలకు అణా తీసుకుంటారు.

సత్యం: వెళ్ళి పట్టుకురా.

[పిచ్చియ్య ఉంగరం చూస్తుంటాడు]

సత్యం: ఏమి టాలోచిస్తున్నావ్?

పిచ్చి: (ఉలిక్కి-పడి) ఎల్తాను.

సత్యం: పిచ్చియ్యతాతా!

పిచ్చి: ఆఁ.

సత్యం: ఆ ఉంగరం యిలా తే.

పిచ్చి: ఏం?

సత్యం: పదిరూపాయలు అప్పుపెట్టడానికి నామీద నీకు నమ్మకం లేకపోతే ఈ ఉంగరం నీకెలా యిస్తాను?

పిచ్చి: బాగుందబ్బాయో! అవసరాన్నిబట్టి అడిగాప్ర-వస్తవు లేందే వాళ్లెలాగిస్తారు. (ఉంగరం యిస్తాడు)

సత్యం: ఇదేం ఉంగరం?

పిచ్చి: బంగారానిదికాదా?

సత్యం: గిల్టుంగరం.

పిచ్చి : నాకొంప ముంచేద్దువన్నమాట.

సత్యం: వందో, వేయో వెనకేసుకుని పెట్టుబడిదార్ల లక్షణాలు నేర్చుకుని పేదవాళ్ళను ఏడిపించే మీలాంటి వెధవల కొంప ముంచడమేకాదు; నాశనం చేయాలి.

పిచ్చి : సత్తైమా!

సత్యం: (చొక్కా పట్టుకుని) వెళ్ళి పట్టుకురా. మాట్లాడావా నీ మాట దక్కదు.

పిచ్చి : (వెర్రిగా) బాబోయ్!

[సీత వస్తుంది]

సీత : సత్యం!

పిచ్చి : చూడు సీతమ్మా!

సత్యం : మాట్లాడకు ముందు వెళ్ళు... అయిదు నిమిషాల్లో రావాలి—వెళ్ళవేం?

పిచ్చి : వెళతాను.

సత్యం: నువ్వెంటనే రాకపోతే మళ్ళీ మీయింటికివస్తాను.

పిచ్చి : ఏదో తంటాలు పడతాను. మరి లేకపోతే?

సత్యం: నీపెట్టె బద్దల కొడతాను.

పిచ్చి : వద్దు! పట్టుకొస్తాను. (వెడతాడు)

సీత : సత్యం! పలుగూ, పారా పట్టుకురానా?

సత్యం: ఎందుకూ?

సీత : బాగున్నవాళ్ళ యిళ్ళన్నీ కన్నమేద్దాం.

సత్యం: దానికి నేర్పు అక్కర్లేదూ?

సీత : దానికి నేర్పేముంది. కన్నం వేసేప్పుడు అలికిడి విని కాస్తవరప్పావాస్తే పలుగు ఎత్తి పొడవట్మే.

సత్యం: ప్రాణంపోదూ?

సీత : ప్రాణంపోయినా మనకు కావల్సిందేడబ్బేగా. పిచ్చయ్యకి తాతకన్నా, సీత్తు కోరుకున్నా ఎవరూ దొరకలా? వెరివాణ్ణిచేసి ఆవిధంగా డబాయిస్తావా? ఎంతో తెలుసుననుకున్న నువ్వే ఈ విధంగా పొరబడితే అన్నయ్యా-ఏదైనా చెయ్యగలుగుతాడుగా!

సత్యం: దొరకూడదా? తెలివితక్కువ వాడైతే, దొంగవు తాడు; దొంగ తెలివైనవాడైతే; దొరవుతాడు. నా కెందుకులే ఈ యాతనంతా.

[రంగడొస్తాడు]

రంగ : అక్కా! శంకరంగారొస్తున్నారు.

[శంకరం వస్తాడు.]

శంక : ఎందుకు-కబురు పెట్టారు? ఏమిటీ కంగారు!

సీత : మీ రిచ్చిన మందు అల్లాగే ఉండిపోయింది.

శంక : ఏం—త్రాగలేదూ?

సీత : ఏలా త్రాగించను? నోట్లో వేసింది గుటక వేయటం లేదు. గురక ఒకటి ప్రారంభించింది.

[శంకరం, సీతా లోపలకు వెడతారు.]

సత్యం: ఏరా రంగా! చెప్పిన వేళకు రావడంలేదేమ?

రంగ : అవుతోంది.

సత్యం: మరి యింకా యిక్కడే వున్నావేం?

రంగ: సైకిలు లేనిదే ఎంతమందికి అందజేయను.

సత్యం: చేసినపనికి సైకిలు లేకపోవడమే శిక్ష. వెళ్ళు మళ్ళీ ఆలస్యమయిందంటే ఈసారి కూడా వుంచను.

[సూర్యం లోపలినుంచి వస్తాడు]

సూర్యం: ఆ పదిరూపాయలేంచేశావ్?

రంగ : శంకరంగారి కిచ్చాను.

సూర్యం: ఎక్కడ తెచ్చావ్ పదిరూపాయలు?

[రంగడు లోపలకు వెళతాడు]

సత్యం: భయపడేవాళ్ళుంటే భయపెట్టటమెందుకు?

సూర్యం: ఎందుకూ భయపడటం?

సత్యం: సైకిలు తాకట్టు పెట్టినందుకు! నీ కీవిషయం తెలీ దేమిటీ?

సూర్యం: తెలిసింది.

[రంగడు లోపలినుంచి పేపర్లుతీసుకువచ్చి వెళ్ళిపోతాడు.]

సూర్యం: రంగా!

[రంగడు ఆగిపోతాడు]

సూర్యం: ఆపని చేయమని నీ కెవర్రా చెప్పింది?

సత్యం: మీనాన్నరోగం చెప్పింది.

రంగ: అవును.

సూర్యం: ఏడిశావు. యింకఅలాంటిపనిచేశావంటే ...

రంగ : గట్టిగాతన్ను. బుద్ధొచ్చిందన్నానుగా! ఆకలేస్తుంటే అన్నం పెట్టలేదుగాని, అక్కకూడా ఒక చెంపకాయ వేసింది. పైగా ఈ రోజు సైకిలుకూడా లేదు. ఏలా గమ్మాలో నాకే తెలియటంలేదు.

సత్యం: వెళ్ళు రంగా!

[రంగడు వెడతాడు; శంకరం, సీత వస్తారు]

శంక : ఈ సైంలో ఏవిధంగానూ వెనకాడ్డానికి వీల్లేదు. చింతామణి తప్పకుండా వాడాల్సిందే. తమలపాకు రసంలో కాస్తకుప్పి అరగతీసి నాలుక్కి రాశామంటే తక్షాలువ గుణం కనిపించాల్సిందే.

సీత : మరి...

శంక : ప్రస్తుతం ఒక మోతాదు వేరేమందు వేశానులే. గురకతగ్గి కాస్త తేలిక పడవచ్చును... కానిచింతామణి వాడ్డమంటే మాటలతోపనికాదమ్మాయి—

సత్యం: భవానీశంకరుణ్ణి, బిల్వమంగళుళ్ళనే ఆరిపేసింది.

శంక : ఏచింతామణినని నీ ఉద్దేశ్యం?

సత్యం: కాళ్ళకూరివారి చింతామణి కదూ?

శంక : (హేళనగా) చింతామణి అంటే నాటకం అట... ఆయుర్వేదం తెలియని ప్రతివాడూ ఆయుర్వేదాన్ని విమర్శించడమే.

సత్యం : ఇదినాటకం గాకపోతేఏమిటండీ. అవసానకాలంవచ్చి ఆయనకు గురక ప్రారంభిస్తేచింతామణివేస్తే రకాలున గుణం కనిపిస్తుందంటారేమిటి? ఒక్కసారి కళ్ళు తెరచి కళ్ళు మూస్తాడా. దానివల్ల ఫలితం... ఇదిగో ఓ భిషగ్వరా! నేను చెబుతున్నాను. వాళ్ళదగ్గర చిల్లికానీ కూడా... మీ చింతామణులూ, మీ చంద్రోదయాలూ, డబ్బుకోరకుండా యిచ్చే పక్షంలోఅయితే నిక్షేపంలా వాడండి. ఏదో ఈ బాధలో డబ్బుంచుకోవాలని మనస్సులో పెట్టుకొని పైకి నాటకమాడితే ఫలితం లేదని చెబుతున్నాను? ఏమంటారు?

శంక : డబ్బులేనిదే వైద్యం చేయడం మాచేతకాదంటాను.

సత్యం: అయితే పెందలాడే దయచేయండి.

శంక: ఏం సీతా! ఇందుకేనా రప్పించింది?

సీత: ఏమిటి సత్యం! ఇది మర్యాదగా వుందా?

సత్యం: అబ్బే! ఎందుకుంటుంది? ఏమన్నా పదులూ, పాతికలూ వుంటే అర్పించుకోండి, నాకెందుకు!

శంక: నువ్వన్నావంటే నేనసలే రాకపోయ్యేవాణ్ణి.

సత్యం: ఔను, నిజం చెప్పేవాడంటే మీకేగాదు, ప్రపంచానికే బాధ.

సూర్యం: శంకరంగారూ! చింతామణి వాడండి.

శంక: చింతామణి వాడ్డమంటే మహామహా లక్షాధికారులే వెనుకడుగు వేస్తారు.

సూర్యం: ఎందుకూ?

సత్యం: డబ్బు ఖర్చని.

శంక: ఔను.

సూర్యం: అయితే వెళ్ళిరండి. డబ్బందిన తర్వాత మీకు కబురు పెడతాం.

[సూర్యం లోపలకు వెడతాడు.]

సత్యం: ఈ లోపుగా చావకుండా బ్రతికుంటే!

శంక : ఎవరు?

సత్యం: అబ్బే మీరు కాదు-వాళ్ళ నాన్న.

శంక : సీతా! చూస్తున్నావుగా?

సత్యం: ఆమె చూడటంలేదు. వింటోంది.

[శంకరం విసురుగా వెళ్ళిపోతాడు.]

సీత : సత్యం! నీ కెన్నిసార్లు చెప్పాలి?

సత్యం: సత్యం ఎన్నిసార్లు చెప్పినా వెగటుగానే వుంటుంది. ఇదిగో సీతా! నా పుర్రెలో ఒక పురుగుంది. అది అన్యాయమనుకునే సంగతేదయినా ఉంటే, ఒక్క నిమిషం నన్ను వూరుకోనివ్వదు. వూరుకుందామనుకున్నా ... తలకాయ నేలనేసి కొట్టినంత పని చేస్తుంది. మధ్య మధ్య నీ చేత మందలింపులనే మందులు తిన డానికి యిదో పెద్ద జబ్బయి కూర్చుంది?

[సీత మాట్లాడదు.]

సత్యం: ఇంకా పిచ్చియ్యతాత రాలేదు ... నీమనసు దగ్గర పని లేదు.- నేనలా వెళ్ళొస్తాను.

[సత్యం నెమ్మదిగా వెళ్తూవుండగా, సీత గుమ్మంలోకిచూసి కెవ్వున అరుస్తుంది]

సత్యం: సీతా! ఏమిటది?

సీత : (కంగారుగా) అన్నయ్యా ... ఖైజారు ...

సత్యం: ఆఁ... (లోపలకు వెడతాడు)

[సూర్యం చేతిలో కైజారుంటుంది. సత్యం కైజారున్న చేయిపట్టుకొని తీసుకువస్తాడు.]

సత్యం ఏమిటది సూర్యం?

సూర్యం: కైజారు.

సత్యం: ఎందుకు తీశావ్?

సూర్యం: పరువు నిలబెట్టుకోడానికి. ప్రాయశ్చిత్తం చేసుకోడానికి.

సత్యం: ఏం జేస్తావ్?

సూర్యం: ప్రాణం తీసుకుంటాను.

సత్యం: ఫలితం.

సూర్యం: తరువాత విషయం నా కనవసరం.

సత్యం: ముందు చావడమే ముఖ్యమంటావ్!

సూర్యం: అవును.

సత్యం: ఇట్లా చస్తే నీ వొక్కడితోనే పోదుగా—అలా బైటకు వెడదాం రా.

సూర్యం: ఎందుకూ?

సత్యం: అలా అంగడికి వెళ్ళి ధీరోదాత్తంగా "నేను ఆహార సమస్యా పరిష్కారంకోసం, ప్రాణత్యాగం చేస్తున్నా"

నని చెప్పి పబ్లిక్ రోడ్డుమీద పొడుచుకుంటే రేపొద్దున ఫోటోతోసహా పేపర్లో పడుతుంది.

సూర్యం: సత్యం!

సత్యం: చేతగానిపని ఎందుకు చేయబోయావ్!

సూర్యం: ఇంతకన్నా చేతనైంది నాకేం కనుపించలేదు.

సత్యం: నీకన్నా నీతే చాలా ధైర్యమైంది.

సూర్యం: కావచ్చును. నే నందుకు ఒప్పుకుంటానుకూడా... ప్రపంచంలోవున్న ప్రతిజీవికన్నా నేను చాలా అసమర్థుడనని నాకు తెలిసిన మీదటే, ఈపనిచేయాలను కున్నాను. మా నాన్నకు చెట్టంత కొడుకుని నేను... మా చెల్లాయికి, తమ్ముడికి అప్యాయంగా కనుపించే విగ్రహం నాది... గతాన్ని ఆలోచిస్తే యింతవరకూ ఎలా బ్రతికానో నాకే అర్థం కావడం లేదు. ఇప్పుడు బ్రతికి ఎదురుగా వుండి, లేని ఆశను వాళ్ళలో కల్పించే దానికన్నా, లేదని నిరాశ కల్పించడమే అవసరంగా తోచింది.

సీత : అన్నయ్యా! ఒక్కసారి యిలా చూడు-మా గురించి నువ్వు బాధపడుతూ చచ్చిపోయే దానికన్నా... బాధకు కారణమైన మమ్మల నందరినీ ముందుగా చంపడం అవసరమేమో—

సూర్యం : చెల్లాయ్!

సీత : నువ్వాపని చేయలేవని నాకు తెలుసున్నా. తీపైన నీ ప్రాణంమీదే నీకు విరక్తి గలిగితే మా ప్రాణాలు తీయడం కూడా ఒక్క లెక్కలోనిది కాదనుకుంటాను. జబ్బుపడ్డ నాన్నకు రక్షణివ్వలేక, మమ్మల్ని నువ్వు పోషించలేక, సుఖంగా నిండు ప్రాణాన్ని తీసుకోడానికి ప్రయత్నిస్తున్నావంటే, బ్రతకటానికన్నా చావే చాలా సుఖమైందిగా గుర్తించేగా, ఆపని చేస్తున్నది? అలాంటి సుఖమైన మార్గాన్ని ముందు మాకు నువ్వెందుకు చూపించ కూడదన్నయ్యా!

సూర్యం : పొరపాటు జరిగింది చెల్లాయ్! ఇక నేను ఈవెధవ పనిచేయను.

సత్యం : (కైజారుతీసి) ఇదుగో సీతా!

[తీసుకొని లోపలికి వెడుతుంది.]

సత్యం : సూర్యం! ఇలా బెంగపడితే లాభంలేదు. మరో కారు మీద నేను ప్రయత్నిస్తారా.

సూర్యం : ప్రయత్నించినా లాభంలేదు.

సత్యం : ఏం?

సూర్యం : లైసెన్సు లేదుగా.

[సీత లోపలనుంచి వస్తూ కళ్ళుతిరిగి బల్లమీద పడిపోతుంది.]

సూర్యం : చెల్లాయ్... చెల్లాయ్... (దగ్గరగా వెడతాడు)

సత్యం: కంగారుపడకు సూర్యం! కళ్ళుతిరిగుంటాయి.
సూర్యం : చెల్లాయ్!
సత్యం : (నీళ్లు తీసుకువస్తాడు. మొగంమీాద చిమ్ముతూ) తిండిలేదు. పైత్యంమొగం పడింది.
సూర్యం : సత్యం! నేను వెడతాను.
సత్యం : ఎక్కడికి?
సూర్యం: మా చెల్లాయికి తిండి తీసుకవస్తాను.
సత్యం: ఎక్కడనుంచి?
సూర్యం : ఎక్కడనుంచయినా సరే, ఏవిధంగా అయినా సరే, తీసుకు రావాలి, తీసుకొస్తాను.
సత్యం : సూర్యం!
సూర్యం : ఎవడు తింటున్న కంచమైనా సరే లాక్కొస్తాను... ఎవడు దాచుకొన్న బియ్యమైనాఎత్తుకొస్తాను... ఏమీా కనుపించకపోతే బాగా తిన్నవాడి పొట్టచీల్చి దానిలో, అన్నమైనా తీసుకొస్తాను. (వెళతాడు)
సీత : (లేచి) అన్నయ్య ఏడి?
సత్యం : అలా వెళ్ళాడు.
సీత : అన్నయ్యా! అన్నయ్యా ! ! (లోనికి వెళ్ళబోతుంది)
సత్యం : (చేయిపట్టుకొని) కాదు. అలా వెలుపలకు వెళ్ళాడు.
సీత : కైజారు మళ్ళీ తీసుకున్నాడా?
సత్యం : లేదు.
సీత : లేకపోయినా, ఏదోవిధంగా ప్రాణం తీసుకుంటాడు. సత్యం, ఎందుకు వెళ్ళనిచ్చావ్? ఎలా విడిచి పెట్టావ్?

సత్యం : సీతా! కంగారుపడకు. ఏంభయంలేదు. మళ్ళీ వెంటనే వచ్చేస్తాను.

సీత : ఏమో సత్యం! నాకు చాలా భయంగావుంది. మా బాధలు ఎవరితో చెప్పుకోం... ఎవరుతీరుస్తారు? ఉన్న వాళ్ళు మనల్ని కన్నెత్తి చూడరు. లేనివాళ్ళకు సాయం చేద్దామని ఉన్నా చేతిలో కానీలేదు. ప్రపంచంలో యింత నీచంగా బ్రతుకుతున్న కుటుంబం మాది ఒక్కటేనేమో ననిపిస్తోంది.

సత్యం : సీతా! ఒక్క మీకుటుంబమే కాదు. వేలకువేలు కుటుంబాలు... లక్షోపలక్షల సంసారాలు, ఈ రోజున ఆహారంలేక నాశనమైపోతున్నాయి.

[పిచ్చియ్య భయంగా వస్తాడు.]

పిచ్చి : అయిదు రూపాయలు దొరికాయబ్బాయా! ఇదిగో! నాలుగు రోజులలో యిచ్చేపక్షమైతే, యిస్తాను సుమా.

సత్యం : అలాగే యిస్తాను ఏది? (తీసుకొని) సీతా! చూశావా. ఏదో అన్నావ్. పిచ్చియ్యతాతంటే ఎంత మంచివాడనుకున్నావ్.

పిచ్చి : మాయదారిమంచిలే.

సత్యం : పిచ్చియ్యతాతకు నేనంటే ఎంతో భయమనుకుంటావేమో, అబ్బే నేనంటే చాలా దయ. లేకపోతే యింటికి వెళ్ళి నమ్మకంగా యిక్కడకు డబ్బుతీసుక వస్తాడా? పిచ్చియ్యతాతా! నువ్వు యిక్కడేవుండు... హోటల్‌కు వెళ్ళి సీతకు అన్నం తీసుకువస్తాను.

పిచ్చి : మరసిపోక బాబూ. పేదోణ్ణి. అయిదు రూపాయలూ యిచ్చేయాలి సుమా!

సత్యం: వడ్డీ?

పిచ్చి : వడ్డీ అక్కర్లేదులే. అసలిత్తేచాలు!

సత్యం: అసలుకూడా యివ్వనసేనా సీఅదురు.

పిచ్చి : అబ్బే; లేదులే.

[సత్యం వెళతాడు]

పిచ్చి : మా సెట్టి పొగరబోతోడు బుల్లా. కొట్టబోయాడు సుమా. అందుకనే తెచ్చాను. నీతో రహస్యం చెబుతాను. ఎవరికి చెప్పబోకు బుల్లెమ్మా. చెడిపోయిందయితేనేం నాకుసూకురు... దాని సల్లనిసూవు. లేకపోతే నేనిల్లాబాగ్గలనంటావా? ఎక్కడన్నా చెప్పేవు బుల్లా—బతికిచెడ్డోణ్ణి.

సీత : చెప్పనులే తాతా.

పిచ్చి : దాని వైబోగం యింతా అంతా అంటావా?బుల్లా. అది ఉన్నప్పుడు మీలాగే మేంకూడా పత్తులుమాడె వాళ్ళంగా... యిప్పుడు దాని బతుకుందీ—కాలుమీద కాలేసుక్కూచుంటేకదలక్కర్లేదు. దానిమీద ఈగ వాలితే ఆరాజు చెప్పతీసుకొట్టెడూ. నౌకరీవాళ్ళను యిద్దర్ని పెట్టాడు.

సీత : కాంతానికే!

పిచ్చి : మరెవరిగురించి సెబుతున్నాను: దానికే! బతికేది నాలుగు రోజులైతేంగాక—అల్లాగే బతకాలంటాను...

అద్దాల బీరువాలు... పెద్ద పందిరిమంచం, ఏవో బొమ్మలు! గదిలోకి వెళితే కళ్ళు సెదిరిపోతాయంటే నమ్ము బుల్లా.

సీత : నువ్వెప్పుడప్పుడూ వెడుతూ వుంటావేమిటి తాతా!

పిచ్చి : గట్టిగా అనకు బుల్లా... కూతురులాంటిదానవు కాబట్టి సెప్తున్నాను. బతికిచెడ్డోణ్ణి. కడుపుతీపు చూడాలని బమ పుట్టినప్పుడు అప్పుడప్పుడూ యెల్తాను. ఎల్లినప్పు డల్లాపాతికా పరకా సేతిలోపెడద్ది... ఏం చీరలూ, ఏం వత్తువులూ...

సీత : నాకెందుకులే తాతా, యిలాంటి కబుర్లు.

[లోపలకు వెళుతుంది. రంగడుకళ్ళు నులుపుకుంటూ ఏడుస్తూవస్తాడు.]

పిచ్చి : ఏం బుల్లోడా ఏడుత్తున్నావ్?

[సీత లోపలినుంచి వస్తుంది.[

సీత : రంగా!

రంగ : పంతులుగారు కొట్టారు.

సీత : ఎందుకొట్టారు?

పిచ్చి : అదుగో దవడమీద ఏళ్ళుకూడా తేలాయ్.

సీత : (దవడచూసి) ఆయనచేతులెట్లా వచ్చాయి? బక్క వాణ్ణిచేసి యింతగట్టిగా కొడతాడా!

పిచ్చి : పొగరమోత్తనం.

సీత : ఏం చేసావురా? ఎందుకొట్టాడు?

రంగ : సైకిలు యివ్వనన్నాడు... సైకిలు లేకుండా నేను చేపల్లమ్మనన్నాను. ఎదిరిస్తావా అని దవడమీద కొట్టాడు. కళ్ళుతిరిగి పడిపోయానక్కా.

పిచ్చి : పోయేకాలం బుల్లెమ్మా. యింటికెల్తాను. లెక్క మాటమర్చిబోకే! పంతులు కనిపిత్తే అడుగుతాలే!

సీత : సరేలే తాతా.

[పిచ్చియ్య వెళ్ళిపోతాడు]

రంగ : కాసిన్ని మంచినీళ్ళియ్యక్కా.

[రంగడుబల్లమీదకూర్చుంటాడు.
సీత మంచినీళ్ళు తీసుకొస్తుంది.]

రంగ: అక్కా! నేనిఁక ఆపనిలోకివెళ్ళను.

సీత : ముందు మంచినీళ్ళు తాగు.

రంగ: (తీసుకుని) గూబ గుయ్‌మని పోయింది. అసలు చచ్చిపోయేనేమో ననుకున్నాను. (తాగి) అన్నయ్యతో చెప్పి వాడిపని పట్టిస్తా.

సీత : కొడితే కొట్టాడులే. అన్నయ్యతో చెప్పకు.

[సూర్యం బియ్యంమూట, చేతిలో
బుట్టతో కంగారుగా వస్తాడు]

రంగ: అన్నయ్య తెచ్చాడు.

సీత : ఇవన్నీ ఎక్కడివన్నాయ్?

రంగ: (చేతిలో బుట్టతీసుకుని) మిఠాయి—భలే (ఉండలు తీసుకుంటాడు.)

సూర్యం: (భయం, కంగారుగా) తెచ్చాను. ఎక్కడనుంచి తెచ్చానో ఎలా తెచ్చానో అడగద్దు. గొడవపెట్టకండి. ఊఁ తీసుకోండి.

[రంగడు ఉండతీసుకోపోతాడు[

సీత : రంగా! తినకు...ఎక్కడ తెచ్చావో చెప్పుఅన్నయ్యా

సూర్యం: రంగనాథమింటికి వెళ్ళాను...వీధిలో అంతా వున్నారు. దొడ్డివేపు కెళ్ళాను.ఎవరూ లేరు. అదివంటగది అనుకుంటాను. బియ్యం. కూరలూ, మిఠాయి, అన్నీ కనుపించాయి. ఏవో చేతికి దొరికినవి పట్టుకొచ్చాను. చెల్లాయ్, నువ్వు ముందుతిను...ఆకలేస్తోంది. నేనుకూడా తింటాను. రంగా! నువ్వుకూడా తిను. చెల్లాయ్! ఆలోచించకు. నన్ను ఏమీ అనకు. ఆకలి తీరినతర్వాత ఎన్నన్నాసరే, పడ్తాను. ఇదిగో వుండతీసుకో.

సీత : అన్నాయ్!

సూర్యం : మాట్లాడకు. తిను చెల్లాయ్. రంగా, నువ్వుకూడా తిను. ఇదిగో నేను పెద్దవుండ తీసుకున్నాను. ఊఁ... తినండి.

[సీత చేతిలోనే ఉండ వుంటుంది. రంగడు, సూర్యం, మిఠాయి ఉండలు నోట్లో పెట్టుకుంటారు. పోలీసు వస్తాడు. అందరి నోట్లోంచి ఉండలు పడిపోతాయి. వెనకాల చలపతి వస్తాడు.]

చల : పట్టుకో-వాడే సూర్యం.

సీత : చలపతిగారూ!

[పోలీసు వెళ్ళి పట్టుకుంటాడు. సూర్యం చేయి విదిలించుకుంటాడు.]

పోలీ: రాస్కెల్ ...కదిలితే లాఠీ ప్రయోగించాల్సివుంటుంది.

సూర్యం: ఆగు! కావాలంటే నేనే వస్తాను.

సీత : చలపతిగారూ!

రంగ : అన్నయ్యా!

పోలీ : జాగుచేయడానికి వీల్లేదు. (సూర్యంచేయి పట్టుకుంటాడు.)

సీత : (ఉన్మాదంతో) చలపతిగారూ! మా అన్నయ్యను రక్షించండి.

చల : నావల్లకాదు. రంగనాథంగారి దగ్గరకెళితే ఏమైనా సాయంచేస్తారు.

సీత : చలపతిగారూ! మీకు జాలిలేదూ? ఆకలితో మల మల మాడిపోయి స్పృహతప్పి పడిపోతే, ఈ ఆహారం తీసుకొచ్చాడు. ఇది దొంగతనం కాదు.

చల : ఇది దొంగతనంకాదూ! దీనిపేరేమంటారు?

సూర్యం: ఇది దొంగతనంకాదు. కాలేకడుపులు చల్లార్చుకోడానికి చేసిన పని మాత్రమే.

చల : ఇంటింటికీ అడుక్కోలేక పోయావా? ఈ వెధవపని చేయకపోతే.

సూర్యం: చలపతిగారూ!

చల : పౌరుషంకూడా పాపం దొంగవెధవకి!

సూర్యం: మాటలు మిగులుతున్నారు. మేం దొంగలంకాదు. మేం కష్టజీవులం. కష్టానికితగిన ప్రతిఫలం లేక పస్తులు పడుతున్నాం. మా కష్టాన్ని, మా శ్రమనూ, దోచుకు తింటున్న దొంగలుమీరు.

చల : నోర్మూయ్!

సూర్యం: మా నాన్న జీవితాన్ని, మా నాన్న రక్తాన్ని, మా నాన్న మాంసాన్ని కాజేసి, చివరిరోజుల్లో, కాసు కూడా యివ్వకుండా, కళ్ళు మూసుకుపోయి ఏడుస్తున్న మీ రంగనాథం పెద్దదొంగ.

పోలీ : పటప్ (పోలీసు లాటీతో డొక్కలో పొడుస్తాడు)

సూర్యం: అమ్మా!

రంగ : అన్నయ్యా!

సీత : డొక్కలో పొడుస్తావా దుర్మార్గుడా.

పోలీ : నోర్మూయ్యి (కాలెత్తుతాడు.)

చల : పోలీస్! దానిగోడవ ఎందుకులే! పద!

[చలపతి బియ్యం, బుట్ట తీసుకుంటాడు. సూర్యాన్ని పోలీసు లాక్కుపోతూ వుంటాడు. రంగడు సూర్యాన్ని పట్టుకొని "అన్నయ్యా! అన్నయ్యా!" అని ఏడుస్తూ వెలుపలకు వెళతాడు.]

సీత : తీసుకెళ్ళి పోతున్నారా...మా అన్నయ్యాను తీసుకెల్లి పోతున్నారా?

[రంగడు తలమీాద నెత్తురుతో విసురుగా వచ్చి 'అక్కా' అంటూా మీాద వాలతాడు.]

సీత : రంగా!

రంగ : లాటీతో నెత్తిమీాద కొట్టాడు.

సీత : తల చిట్లిపోయింది.

రంగ : అన్నయ్యాను తీసుకెల్లి పోతున్నారు.

[లోపలనుంచి కెవ్వున కేక వినిపిస్తుంది.]

సీత : ఆఁ ఏమిటది?

[విసురుగా యిద్దరూ లోపలకు వెళతారు. సీత లోపలనుంచి "నాన్నా, నాన్నా" అని బిగ్గరగా ఏడుస్తుంది. సత్యం బుట్టతో అన్నం తీసుకొస్తాడు. ఏడుస్తూ రంగ వొస్తాడు.]

సత్యం: ఏమిటిరంగా?

రంగ: అన్నయ్య జైలుకెళ్ళాడు (బిగ్గరగా) నాన్న చచ్చి పోయాడు.

(క్రిందపడి పోతాడు.)

సత్యం : (ఆశ్చర్యంగా, వెర్రిగా) ఆ!

(చేతిలోబుట్ట జారిపోతుంది)

(తెర జారుతుంది.)

## నే ప థ్య గీ తం

సాకీ : అయో... అమాయకుల పైన కక్షా...
నిరామయుల కేనా శిక్షా... ...
ఇదా ధర్మము – ఇదా న్యాయము
ఇదా లోకసామాన్యము...
లేదేమో మంచికి స్థానము... ...॥
నీతి, నిజాలకు నిలిచేవారికి—
కష్టాలే—కానుకలా!

సాకీ : పాపాలకు పడగెత్తేవారికి
జీవితమంతా వేడుకలా!! ...॥
ఇదా ధర్మము – ఇదా న్యాయమూ
ఇదా లోకసామాన్యము
లేదేమో మంచికి స్థానము... ...

# అన్నా - చెల్లెలు

## రెండవ రంగం

[రంగం యథాప్రకారంగానే వుటుంది సైకిలుం జేస్థానంలో మంచంఎత్తి వుంటుంది. తెరలేచేసరికి పాతచొక్కా కుడుతూ, సీత లోపలినుంచి వచ్చి బల్లమీద కూర్చుంటుంది. మొగం చాల దైన్యంగానూ, విచార పూరితంగానూ వుంటుంది. పిచ్చయ్యతాత వీధిలోంచి వస్తాడు... ఒక్కసారి పిచ్చయ్యకేసి చూసి తనపనిలో నిమగ్నమౌతుంది.

పిచ్చి : అయిపోయింది.. అప్పుడే యిరవై రోజులయింది. ఇంకా కళ్ళెదురుగుండా రామయ్యనుసూత్తున్నట్టుంది. బతికి సెడ్డోళ్ళ బతుకులు యిల్లాగే తెల్లారిపోతయ్. విశారించకమ్మా సీతమ్మా. ఏంజేత్తాం - గొడ్డనాన్న, మనిషనాన్న రుణమున్నంతకాలమే!

సీత : నాన్నకు సరైన వైద్యం చేయించలేక, తిండి పెట్టలేక చంపేశాం పిచ్చియ్యతాతా.

పిచ్చి : అదేంటమ్మాయ్! బూమిమీద నూకలకు మనం కర్తలమా పిచ్చిగాని—

సీత : కడుపునిండా తిండివుంటే యింతత్వరగా చచ్చిపోడు నాన్న... అన్నయ్య అన్యాయంగా ఖైదుకెళ్ళాడు. కష్టాలు మరీ ఎక్కువయ్యాయి.

పిచ్చి : అయితే రంగణ్ణి ఏదో పనిలోకి పంపిత్తున్నావంటగా?

సీత : ఏం పనిలే-రంగనాథంగారి మిల్లులోకే వెళ్తున్నాను.

పిచ్చి : బియ్యం మిల్లేనా?

సీత : ఔను.

పిచ్చి : పంతులుగారందుకేనేంటి, రంగడి మాటెత్తితే పళ్లు కొరికాడు?

సీత : ఏమన్నారు?

పిచ్చి : ఏదో లెక్కివ్వాలంట!

సీత : డబ్బా!

పిచ్చి : మరేనంట. ఎనిమిది రూపాయలెంతోయివ్వాలంట... ఎగేసి పోగేశాడని పెద్దపెద్ద కేకలెడుతున్నాడు... అయినా బతికి చెడ్డోళ్ళు మాటనిపించుకోవడం మంచిది కాదమ్మా.

సీత : ఏం చెయ్యాలంటావ్?

పిచ్చి : బాకీ వున్నమాట నిజమేనా?

సీత : రంగణ్ణి కనుక్కోవాలి.

పిచ్చి : కనుక్కొని బాకీవుంటే ఆడిమొగంమీద పడేయండి... అయితే... బుల్లెమ్మా! సత్తెం చేసినపని చూశావా?

సీత : ఏం చేశాడు?

పిచ్చి : ఆ...ఎరగనట్టు అలా అడుగుతావేంటమ్మా... ఆ రోజున అయిదురూపాయలిచ్చాను. దగాకోరు మనిషైతే యిత్తానా? ఈ నాటికి అయిదురూపాయలకి

అయిదణాలు వచ్చే నాచేతిలోకి రాకపోనా, వత్తేనప్పు
మీద ఎవరికన్నా యిత్తే?

సీత : వచ్చిన తర్వాత చెబుతాలే తాతా.

పిచ్చి : మిసనుకొట్టుదగ్గరకు అయిదుసార్లు తిరిగాను. మిసనూ
బైటలేదు, మనిసీ లేడు.

సీత : ఎక్కడకెళ్ళాడు?

పిచ్చి: ఏమో!

[రంగడు మాసిన చొక్కాలతో వస్తాడు.]

రంగ : రేపుగాని యివ్వనన్నారక్కా.

సీత : చలపతిగారేనా?

రంగ: చలపతిగారు కాదు. గుమస్తా నడిగాను.

సీత : పోనీ రెండు రూపాయలన్నా పట్టుకురాలేకపోయావా?

రంగ: చేరి వారంరోజులు కాలేదు 'జీతమా' అని ఎర్రబడి
చూశాడు. పేపర్లమ్ముకుంటేనే బావుండేది. యిదవపని.

పిచ్చి: రంగా! మిల్లులో ఏంపని చెయ్యాలి నువ్వు?

రంగ: నా మొగం పని – నీ కెందుకులే.

సీత : తప్పు, చెప్పరాదూ! (లోనికెళుతుంది.)

పిచ్చి: నేనంటే ఏలాకోళంలే యీ బుల్లోడికి. బతికిసెడ్డోణ్ణి
పుసుక్కునలా అనగూడదబ్బాయా...మర నడిపిత్తావా?

రంగ: అంటే?

పిచ్చి: 'డయివరువా' అని?

రంగ: అప్పుడే డ్రవింగొస్తా దేంటి?

పిచ్చి: మరేం పని సేత్తావ్?

రంగ: ఆయిల్ మేన్.

పిచ్చి: పెద్దుద్యోగమే! పేరు బాగానేవుంది. బతికి సెడినా మంచి నౌకరీయే దొరికింది.

రంగ: యెదవనౌకరీలే. ఆయిల్ మేన్ అంటే ఏమి టనుకుంటున్నావ్! మిషనులో ఆయిల్ పొయ్యడం, మిషన్లు తుడవడం యింతే.

పిచ్చి: ఓస్ యింతేనా? అయితే రంగా! మీ అన్నయ్యను చూశావా?

రంగ: చూశాను.

పిచ్చి: శిచ్చ యెన్నాళ్ళేశారు?

[కంచంతో సీత వస్తుంది.]

సీత: శిక్షెందుకూ, ఏంనేరం చేశాడని... నేరంలేదుకాబట్టే విచారణ లేకుండా ఖైదులో పెట్టారు. వాళ్ళిష్టమొచ్చి నంత కాలం వుంచుకుంటారు. నోరులేనివాళ్ళేగా పేద వాళ్ళు. అడిగేదా తెవరుంటారు?

పిచ్చి: పోనీ ఒకసారి రంగనాథంగారితో చెపితే...?

సీత: తాతా! అలాటి మాటలు చెప్పకు.

పిచ్చి : ఇదేంటి బుల్లెమ్మా, నీ గురించి చెబుతున్నా కోపమే?

సీత : తాగరా రంగా!

రంగ: రెండస్నం మెతుకులుకూడా లేవు. అంతాగంజే.

సీత : ఇద్దైనా ఆ సుబ్బమ్మగారు పంపించారు...పిచ్చియ్య తాతా! ఒక్కశేరు బియ్యముంటే అప్పివ్వా. రంగడు జీతం తెచ్చిన తర్వాత నీ బియ్యం నీకిస్తాను.

రంగ: అక్కా, నువ్వే గెంజన్నా తాగావా? ఇది నువ్వు తాగక్కా.

సీత : వద్దులే రంగా నువ్వు తీసుకో - ఏం తాతా?

పిచ్చి : బతికి సెడ్డోడిచేత అబద్ధమాడించాలని గాని...నాదగ్గ రెక్కడుంటాయమ్మా? సంపాదనా ఏమన్నానా? పొద్దున్న సోలెడు గింజలుంటే పొయ్యిమీద పెట్టు కున్నాను...బుల్లెమ్మా! సత్తెమొత్తే చెప్పమ్మా ఎల్తాను (వెడతాడు.)

[రంగడు గంజి తాగుతుంటాడు.]

రంగ: ఆ పని చేయలేనక్కా.

సీత : అన్నయ్య వచ్చేవరకూ ఏదో విధంగా ఆ పని చేయి బాబూ! తరువాత మానేద్దువుగాని ... (బాధగా) అబ్బా!

రంగ : ఏమక్కా! ఆకలేస్తోందా?

[వంతులొస్తాడు.]

పంతు: ఏరా రంగా! నీ బాకీ యెవడిస్తా డనుకున్నావురా?

సీత : ఏం బాకీ?

పంతు: వాణ్ణే అడుగు.

రంగ : ఎంతివ్వాలి మీకు?

పంతు: అప్పుడే మరుపుకూడా వచ్చిందా?

సీత : ఏంతో చెప్పండి.

పంతు: అయిదు రూపాయలు ఓసారి తీసుకున్నాడు. అప్పుడప్పుడూ చిల్లరగా వాడుకున్నది,మూడు రూపాయలు. మొత్తం ఎనిమిది.

రంగ: మీ కివ్వవలసింది అయిదు రూపాయలే,

పంతు : ఆ మూడు నీ బాబిస్తాడా?

రంగ : మా బాబు దగ్గర కెళ్ళకుగండి!

[సత్యం వింటూ వస్తాడు.]

రంగ : సైకిలు పంచర్లు పడితే అప్పుడప్పుడూ వేయించుకొన్న బాపతు ఆ మూడురూపాయలూనూ... పైగా అది జీతంలోనిది కాదనీ వేరేననీ ఈయనే చెప్పారు.

సీత : ఏమండీ?

పంతు: కళ్లు మూసుకుపోయి కంచెలమీదా, ముళ్ళమీదా, సైకిలు త్రొక్కి పడేస్తే నేను బాధ్యుణ్ణా?

సత్యం: పాతసైకిలిచ్చి సందులూ, గొందులూ తిప్పించి పేవ ర్లమ్మిస్తే సైకిలు దెబ్బతింటే వాడు బాధ్యుడా?

పంతు: సత్యం! నీ కనవసరం.

సత్యం: సత్యం ప్రతివాడికీ అవసరమే-పంతులుగారూ! పేవ వాళ్ళనుచేసి వాళ్ళకు ఆధారం ఎవ్వరూ లేరని డబా యిస్తే... హృదయమున్న ఏ మానవుడూ సహించి ఊరుకోడు. పంతులుగారూ! లోగడ ఛెకీలమని రెండు లెంపకాయలు కొట్టారే! ఆ పనే మిమ్మల్ని ఎవరన్నా చేస్తే?

పంతు: డొక్క చించేస్తాను.

సత్యం: డోలు కట్టేస్తారు, బాకాలు వూదేస్తారు, పసదోసి వాళ్ళను జైల్లో వేసేస్తారు. ఇదంతా ఏమిటి? పలుకు బడి... ముందు బైటకు వెళ్ళండి. వాళ్ళన్నయ్యే వాణ్ణి మీ పనిలో ప్రవేశపెట్టాడు... బాకీలు, జమలూ, ఏమన్నావుంటేఅతని ద్వారా తీర్చుకోవలసిందేగాని..

పంతు: నిన్ను అడగటానికి రాలేదు. మీకూమీకూ ఏమన్నా సంబంధాలుంటే నా కక్కర్లేదు.

సత్యం: వాళ్ళనడిగినా వాళ్ళిచ్చే సమాధాన మిదే.

పంతు: ఏం సీతా!

సీత : అన్నయ్యను రానివ్వండి.

రంగ: అన్నయ్య వచ్చినా ఆ మూడురూపాయలు మాత్రం యివ్వాడు. (మంచం వాల్చుకు పడుకుంటాడు.)

పంతు: అలవాటేగా మీకు

సత్యం: ఏమిటి?

పంతు: పసులసొమ్ము దొంగిలించడం.

సీత : జాగ్రత్తగా మాట్లాడండి పంతులుగారూ! దొంగతనం ఎవరు చేశారు?

సత్యం: ఆ...మీ అన్నయ్య చేశాడుగా...కడుపాకలి తీర్చుకోటానికి. అలాంటి బహిరంగ దొంగతనమంటే ఆ పంతులుగారికి బలేకోపంలే. ఈయ నీమధ్య పరిమిట్ల కోసం లోపాయకారిగా ప్రయత్నం చేస్తున్నాడు. బియ్యం ఎగుమతీ, దిగుమతులన్నీ కమీషన్ కోసం రాత్రే ఏర్పాటు చేస్తున్నాడు. ఇది రహస్యవ్యాపారం. చేస్తే అలాంటివే చేయాలి. వస్తే ఒక్క సంవత్సరం లోనే, లక్షరూపాయ లొస్తాయి. దాన్ని బ్లాక్ మార్కెట్ అంటే ఆయనకు చాలా కోపం వస్తుంది. గ్రహం వక్రించి వీళ్ళపాపం పండిందంటే, మీ అన్నయ్య జైలునుండి తిరిగివస్తాడు; వీళ్ళు మళ్ళీతిరిగి రారు.

పంతు : సత్యం!

సత్యం : సత్యం; సత్యం; ముమ్మాటికీ సత్యం. వెళ్ళండి.

పంతు : నా డబ్బు యిస్తేనేగాని వెళ్ళను.

సత్యం : మొన్నేదో పొరపాటు నిచ్చానని మళ్ళీ అలాగే చేతులో పడద్దేమోనని చూస్తున్నారేమో. ఎంత గొంతు చించుకున్నా ఒక్క కానీకూడా రాదు.

పంతు : అదీ చూస్తాను. ఎలారాదో చూస్తాను...సీతా! మళ్ళీ వస్తానుగా. జాగ్రత్తపెట్టి వుంచకపోతే మాట దక్కదు.

[పంతులు వెడతాడు, సత్యం కూర్చుంటాడు.]

సీత : పనేమీ దొరకలేదట?

సత్యం: కాయకష్టం చేసేవాడికి ఏవిధంగానూ గడవట్లేదని...

సీత : ఏదన్నా వర్తకం పెట్టావా?

సత్యం : పెట్టుబడి వుండొద్దూ?

సీత : మరేం చేస్తున్నావు?

సత్యం : ఫలితంగాని ప్రయత్నం చేస్తున్నాను.

సీత : ఏమిటా ప్రయత్నం?

సత్యం: మీ అన్నయ్యను విడుదల చేయడంకోసం తిరిగాను.

సీత : ఏమన్నారు?

సత్యం : ముందు జామీను కావాలన్నారు. తీరా జామీను నే నిస్తానంటే, "నువ్వు పకీరువు, నీకు విలువేద న్నారు"...రంగనాథాన్ని కూడా అడిగాను. కావా లంటే ఒక లాంగ్ కోటు కుట్టడానికి [illegible]

మీ అన్నయ్యను విడుదల చేయడానికి మాత్రం నష్టం కోడట.

[శంకరం ఒక కార్డుతో వస్తాడు.]

శంక: అమ్మాయి! రేపటి రోజున సత్యన్నారాయణ వ్రతం ప్రత్యేకించి మిమ్మల్ని పిలువడానికని వచ్చాను.

సీత : సంతోషమండి, అన్నయ్యవుంటే వచ్చేవాడుగాని...

రంగ : (లేస్తాడు) భోజనాలుంటే నేనొస్తానండి.

శంక : భోజనాల ఏర్పాటులేదు. వట్టి ఫలహారం మట్టుకే యిస్తాం. తిండిదొరక్క- చచ్చేరోజుల్లో భోజనా లేమిటి?

రంగ : అయితే యింటికే పంపించండి. (పడుకుంటాడు)

సీత : రంగణ్ణి ఆ వేళకు ఏదో విధంగా పంపిస్తాలెండి. మా మీద మీకున్న దయకు, మీకు ఏం ఉపకారం చేయాలో అర్థం కావటల్లేదు.

సత్యం: అందుకేగా ఆయన సత్యన్నారాయణ వ్రతం పెట్టింది.

సీత : ఎందుకు?

సత్యం : ఈ శుభసమయంలో మీ ఉపకారబుద్ధికి ప్రతి ఫలంగా ఏదో పైసా రూపంలో కాస్త పడేస్తారని,... శంకరంగారూ! చదివింపులున్నాయండి?

శంక : ఉన్నాయి.

సీత : సత్యన్నారాయణ వ్రతంలో చదివింపులేమిటి?

సత్యం : చదివింపులు గురించే సత్యనారాయణ వ్రతం చేస్తారు వైద్యులు. పరిశీలించి చూచినా దైవభక్తి నే మచ్చు వాళ్ళ హృదయం మీదెక్కడా వుండదు.

శంక : నేను వెళతానమ్మాయి.

సీత : మంచిది.

శంక : విషయంకూడా తెలిసిందేగా?

రంగ : ఏమిటదీ?

సత్యం: భోజనానికి కాదులే నువ్వు పడుకో.

సీత : రోగం నయంకాకుండానే నాన్న చచ్చిపోయాడు.

సత్యం: చచ్చినా బ్రతికినా ఏనుగు ఖరీదు వెయ్యిరూపాయలు.

రంగ : శంకరంగారి మందువేయడంవల్లే మా నాన్న చచ్చి పోయాడు.

శంక : రంగా! జాగ్రత్తగా మాట్లాడు.

రంగ : అక్కా నేను పనిలోకి పోతున్నాను. (వెడతాడు)

సత్యం: కుర్రాడు. వాడికి జాగర్తేమిటి? మీరు జాగర్తగా ఆలోచించే ఈ శుభలేఖ యిచ్చారా? వాళ్ళకష్టా లను దృష్టిలో వుంచుకొనే మీ రికోరిక కోరుతు న్నారా? వీళ్ళ నాన్న చచ్చిపోయాడు. వీళ్ళన్నయ్య జైల్లోకెళ్ళాడు. వీళ్ళకు తినడానికి తిండిలేదు. ఈ పరిస్థితుల్లో మీ సత్యనారాయణ వ్రతానికి కట్నాలూ, కానుకలూ వీళ్ళు చదివించాలా? ఎంత

ఉదారహృదయంగల డాక్టరులండీ! శంకరంగారూ! రేపు చదివింపులుగా, ఏమన్నా డబ్బువస్తే కాస్త పిల్లకు సదరండి. అదీ యిదీ చానకుండా బ్రతికుంటే ఎప్పుడో జమకడతారు.

శంక : ఈ విషయాల్లో నీకు జోక్యంలేదు. అంతగా వాళ్ల మీద నీకు దయుంటే, వాళ్లు యివ్వవలసిన నలభై రూపాయలూ రేపు తెచ్చిపడేయి.

సీత : నలభై రూపాయలా!

శంక : ఏం అంతఆశ్చర్యపడతావ్ ... జ్ఞాపకంలేదూ. ఏభై రూపాయలిస్తానని వైద్యం చేయించుకొన్నాడుగా! పది రూపాయలకన్నా ఎక్కువ పుట్టిందా నాకు!

సత్యం: ఆ పదిరూపాలు కూడా యివ్వడమే దండగ.

శంక : ఏం, ఎందుకూ?

సత్యం: పిల్ల నాన్నను చంపినందుకు!

శంక : ఏమిటీ!

సత్యం: అవునండీ... వైద్యం చేయడం ఎందుకు ... రోగిని ఆరోగ్యవంతుణ్ణి చేయడమేగా—ప్రాణంపోవడం అటుంచండి, మీరు చేయిపట్టుకొని అతనినోటిలో మందువేసిననాటి నుంచేగా మాటలేకుండా పోయింది. ఒక్కరోజైనా మీ మందుగుణం అతని మీద కనుపించిందా? ఇంకా కొన్ని నెలలు బ్రతక

వలసినవాడిని మీమందులతో ప్రాణంతీసి డబ్బు కోసం వచ్చారా! ఏ మొగం పెట్టుకొచ్చారు? వెళ్లండి.

శంక : వెళ్ల మనడానికి నువ్వెవరవు?

సత్యం: అధికారం లేకుండా డబ్బు అడగటానికి మీరెల్లా వచ్చారో, అనధికారంగా నేనూ ఆ సమాధానాన్నే యిస్తున్నాను. మీరు డబ్బడగకుండా ఎంతసేపు కూర్చున్నా నాకు యిబ్బంది లేదు.

శంక : ఎంతసేపున్నా కూర్చోడానికి నాకు యితర పను లేమీ లేవిక్కడ. ఆ పనులుండేవాళ్ళు ఎప్పుడూ యిల్లు అంటిపెట్టుకునే వుండవచ్చు.(వెడుతూ వుంటాడు)

సీత : శంకరంగారూ! మీరన్నమాటల్లో అర్థం?

శంక : తెల్లారిలేస్తే అనేకమంది యిళ్లకు తిరగాల్సిన పని నాది. నేను అనేమాట నా ఒక్కడి ఉద్దేశ్యంతో కూడుకున్నది కాదు. పదిమందీ అనుకునే మాట.

సీత : పదిమందీ ఏమనుకుంటున్నారు?

శంక : నా నోటితో నేను చెప్పలేను... సత్యం ఏ సంబంధం లేకుండా మీయింటికి కిన్నిసార్లు తిరుగుతూ వుంటాడు? ఈ ప్రశ్న యెదురొచ్చిన్న ప్రతివాళ్ళకూ సమాధానం కూడా ప్రక్కనే వుంటుంది.

సత్యం: సమాధానం ప్రక్కనే వుంటుంది? ఏం సమాధాన మంటుంది? చుట్టాన్ని కావడంవల్ల వచ్చాను. వాళ్ళ న్నయ్యకు స్నేహితుణ్ణి కావడంవల్ల వచ్చాను. కష్ట

దశలో కాస్త పలకరించి పోవడానికి వస్తున్నాను. ఇది తప్పా? పదిమందీ ఏమనుకుంటున్నారు చెప్పండి?

సీత : చెప్పనక్కర్లేదు. తెలిసింది. మీరిక వెళ్లండి శంకరం గారూ.

సత్యం: ఆగండి! పదిమందికళ్లూ పెద్దవిచేసుకుని ... ప్రతి ఒక్కళ్ళుచెప్పాల్సి మరొకళ్లు కోరుకొక్కాని, లేనిపాపాన్ని కల్పించుకోని, ఆపాడు పాచినోళ్లతో గుసగుస లాడు కొన్నా, మాకేం భయంలేదని చెప్పండి... వెళ్ళండి.

శంక : చెప్పడానికి నాకిదో ఉద్యోగం కాదు...సీతతో... మర్యాదగా సాయంత్రంలోగా డబ్బు జాగ్రత్తచేసి వుంచు వస్తాను.

[శంకరం కోపంగా వెడతాడు.]

[సీత ఆలోచిస్తూ వెళ్ళి మంచంమీద కూలబడి పోతుంది]

సత్యం : ఏం సీతా! అలా అయిపోయావేమిటి?

సీత : తెలుసుకోలేక పోయాను. ఇంతకుముందు పంతులు కూడా అదేమాటన్నాడు...ఏం చెప్పను?

సత్యం: ఏమీ చెప్పనక్కర్లేకుండానే అర్థమైపోతుంది.

సీత : ఏమని?

సత్యం: పిరికిదానవని...వాళ్ల మాటలు ఎందుకు లెక్కచేయాలి మనం! నీతిని అవినీతిగా, అవినీతిని నీతిగా తారు మారుచేసే అధములు...అపవాదులు వేయడానికి అడ్డే

ముంది? వాళ్ళమాటలకు చెదిరిపోయి అయ్యో! మా బ్రతుకు లేం కానని బెంగపడి చస్తామా?

సీత : సత్యం!...నువ్వు మగవాడవు. నీకేం భయంలేదు... ధైర్యంగా ఎన్నెన్నో కబుర్లు చెబుతావ్.

సత్యం: ఆడదయితే?

సీత : బెంగపడి చావాల్సినమాట నిజమే...ఆడది,అందులో వయస్సులోవున్న ఆడది, పెళ్ళికాని ఆడది, మగవాడితో మాట్లాడ్డమే కాదు, చూడ్డమే నేరం.

సత్యం: రోజులు మారాయి సీతా!

సీత : రోజులు కొందరికి మారొచ్చు. అందరికీ మారలేదు. అందులో పేదవాళ్ళకు మారలేదు...కూటికి గతిలేని వాళ్ళకు అసలే మారలేదు. నా మాటలు వినుసత్యం! నీలో దురుద్దేశ్యం వుందని నేననను. నువ్వు మా అన్నయ్య వచ్చేవరకూ మా యింటికి రాకపోవడమే మంచిది.

సత్యం: "నన్ను అనుమానిస్తున్నావా?"అని నేనడగను. నిన్ను నేను అనుమానించను. నన్ను నువ్వు అనుమానించ లేవు. మీ అన్నయ్య వచ్చేవరకూ మిమ్మల్ని కంటికి రెప్పలా కాయడం నాధర్మం. ఇప్పుడు వెళతాను... మళ్ళీ వస్తాను. వచ్చేదానికి నీ అభ్యంతరం వుండటానికి వీల్లేదు.

సీత : ఇక రావద్దు సత్యం.

సత్యం: సీతా! నేను వచ్చేదానికి నువ్వడ్డుపెట్టే అధికారం చాలా నీచమైంది. రేప్రొద్దున మీ అన్నయ్య జైలు నుంచి విడుదలై "మా వాళ్ళను చూస్తున్నావా? మా యింటికి వెళ్తున్నావా?" అని అడిగితే నేనేం సమాధానం చెప్పను—సమాధానం చెప్పకుండా తలవంచుకొని నిలబడ్డానికి నేనుచేసిన నేరం ఏమిటి? ఏం మాట్లాడవు సీతా?

సీత : ఏం మాట్లాడను సత్యం! నేనేం మాట్లాడలేను. ఇక నువ్వు మా యింటికి రాకపోవడమే మంచిది.

సత్యం: సరే! మిషను బేరం పెట్టాను. డబ్బు వస్తుంది. నేను రాకపోయినా డబ్బు అందుకొని నీ యిబ్బందులు తీర్చుకో.

సీత : మిషను ఎందుకు బేరంపెట్టావ్?

సత్యం: డబ్బుకోసం.

సీత : డబ్బెందుకు!

సత్యం: డబ్బెందుకేమిటి? వెర్రిప్రశ్న! అవసరాలు గడుపుకోటానికి.

సీత : ఎవరవసరాలు?

సత్యం: పస్తులుపడేవాళ్ళ అవసరాలు. మానుషానికిబడి మలమల మాడిపోయేవాళ్ళ అవసరాలు. నేను వెళతాను సీతా! (నిలబడే వుంటాడు.)

సీత : మళ్ళీ రమ్మంటానేమో అనుకుంటున్నావా?

సత్యం: సీతా!

సీత : ఔను...నువ్వు మా యింటికెందుకు రావాలి? మా గురించి నువ్వు మిమను అమ్ముకోవడం ఎందుకు జర గాలి? నీకే అభిప్రాయం లేనప్పుడు ఎందుకు చేశావ్?

సత్యం: అభిప్రాయం!

సీత : ఔను. రేప్రొద్దున నీకు సంపాదన లేకుండా వీధుల్లో తిరుగుతుంటే, మిమను ఎందుకమ్మావని ఎవరన్నా అడిగితే నామీద అపవాదు రావడానికి కదూ? ఇంతవరకూ నువ్వుచేసిన సహాయానికి, నీకేవిధంగానూ ఉపకారం చేయలేనందుకు బాధపడుతున్నాను. చేయ లేనేమోనని కూడా చెపుతున్నాను. ఇక నీడబ్బు నా కక్కర్లేదు. వెళ్ళిపో.

[మంచంమీద కూలుతుంది.]

సత్యం: సీతా! నేను చాలా కఠినుణ్ణి. నిన్ను బాధ పెట్టాను. నీచుణ్ణిమాత్రం కాదు, నీ నా హృదయాల్లో మనకు తెలియకుండా ఏదన్నా ఒక పెద్దకోర్కె, మానాన్న కోర్కెగా పెనవేసుకుంటే ఆత్మవిమర్శచేసి తప్పని సరిగా తుడిచి వేసుకోవడం మనిద్దరికీ చాలా అవసరమే. ఆపత్తులో రావద్దన్నా రావాలని కోరుతుంది యిన్ని నాళ్ళస్నేహం. వెళుతున్నా.

సీత : (ఏడుస్తూ) సత్యం!...

సత్యం: (చూడకుండా) పరీక్షకోసం పిలుస్తున్నావనే నేననుకో లేదు. సత్యం అంత మనోనిబ్బరం లేనివాడు కాదు.

సీత : (దుఃఖంగా, చేతులు పట్టుకొని) సత్యం! అన్నయ్య ఒకనాడు ఈలాగే అన్నాడు. అప్పుడు అన్నయ్యతో అలా మాట్లాడ్డం తప్పని చెప్పాను. ఇప్పుడలాగే నేను వెళ్ళిపొమ్మని చెప్తున్నాను. అప్పుడు అన్నయ్య అకారణంగా ఆవేశంలో వెళ్లిపొమ్మన్నాడు. నేను బాగా ఆలోచించి వెళ్లిపొమ్మంటున్నాను. నువ్వు చేసిన సహాయానికి నీ పాదాలదగ్గర తలవంచి నమస్కరిస్తాను. (కాళ్ళమీద పడుతుంది; ఏడుస్తుంది)

సత్యం: నా కళ్ళు ఎప్పుడూ చెమ్మగిల్లలేదు... నేను చేసిన స్వల్పసహాయానికి నీయీ పని నన్ను దుఃఖంతో తల వంచుకునేటట్లు చేస్తుంది. (వెళ్ళిపోతాడు.)

సీత : (ఆవేదన, ఆవేశంతో బిగ్గరగా) సత్యం!

[మంచంమీద కూర్చుని ఏడుస్తూంటుంది.]

[చలపతి వస్తాడు.]

చల : సీతా! ఏడుస్తున్నావేం? సత్యంకూడా మొగం మదో మాదిరిగా పెట్టుకొని నా కెదురయ్యాడు... సత్యం ఏమన్నా అన్నాడా పాపం.

సీత : ఏమీ౦ అనలేదు.

చల : పాపం పెళ్ళయిన తర్వాత తప్పనిసరి. పెళ్ళికాని ముందునుంచికూడా... పాపం!

సీత : చలపతిగారూ!

చల : అన్నమాటల్లో తప్పుందా? మీ నాయన బతికుండగా నాతో చెప్పినట్లు గుర్తు, సత్యాన్ని నీకిచ్చి పెళ్ళి చేస్తానని.

సీత : ప్రతినిత్యం పేదవాళ్ళకు పెళ్ళిచేస్తూనేవుంది దరిద్ర దేవత, యింకా పెళ్ళెందుకు? కడుపునిండి, శరీరం పుష్టిగా వుండి, జీవితం జరగడానికి దార్లుంటే, పెళ్ళి కావాలి, ప్రేమా కావాలి... మాకేమీ అక్కర్లేదు. మమ్మల్ని ఎవరూ అన్యాయంగా ఆడిపోసుకోవద్దు. సత్యం చాలా మంచివాడు. సత్యం, ఏ చెడ్డ తలంపుతో నూ మా యింటికి రాలేదు.

చల : ఎవరేమన్నారు? పాపం ఎందుకంత ఆవేశపడ్డావ్?

సీత : ఎవరేమంటారు? ఎందుకంటారు? ఎవరేమన్నా ఊరుకోను. నన్నన్నా వూరుకుంటాను. సత్యాన్నంటే అసలు సహించలేను... సత్యం చాలా మంచివాడు. (మంచంమీద పడిపోతుంది, ఏడుస్తుంది.)

చల : సీతా! నీ మనస్సు చాలా చికాకుగా వున్నట్లుంది. పాపం కష్టకాలం.

సీత : మా కష్టాలకు కారణం మీరే...మా నాన్నను మాకు లేకుండా చేశారు. మా అన్నయ్యను జైల్లో పెట్టేరు.

చల : పొరబడుతున్నావ్ సీతా! నన్ను నువ్వు అర్థంచేసుకో లేదు. ఏం మీమీద నాకేమన్నా పగా? మీ అన్నయ్య

నేరం చేశాడు కాబట్టి జైలుకెళ్ళాడు. రంగనాథం దగ్గర నౌకరీ కాబట్టి ఆయన నా నెత్తిమీద ఈ అభాండం వెయ్యడానికి పోలీసులతో నన్ను యిక్కడకు పంపించాడు. అంతమాత్రాన నేను చేసినట్లుగా నువ్వనుకోవడం మంచిదేనా?

సీత : మరి మా అన్నయ్య ఎప్పుడు విడుదలౌతాడు?

చల : ఏమో నాకేం తెలుస్తుంది.

సీత : మా అన్నయ్య ఏం తప్పు చేశాడు? కొద్ది నేరానికి ఇంత కాలం ఖైదులో పెట్టడం ఎందుకు చెప్పండి?

చల : ఏమో అదే అర్థం కావడంలేదు... అయినా నేరానికి పెద్దా చిన్నా తారతమ్యానికన్నా, అసలు అది నేరమా కాదా అని ప్రభుత్వం ఆలోచిస్తుంది. పాపం దొంగతనమనేదాన్ని సహించి వూరుకోవడం చాలా కష్టం సీతా.

సీత : దొంగతనం...యిదీ దొంగతనమేనా? పట్టెడు మెతుకులు. ఆకలికోసం తీసుకురావడం కూడా దొంగతనమేనా?

చల : అదే! పట్టెడు మెతులుగాని, పుట్టెడు ధాన్యంగాని, పాపం చాటుమాటుగా ఎవ్వడు తీసుకొచ్చాడో వాడు దొంగే!

సీత : మా పరిస్థితులు కళ్ళారా చూస్తున్న మీరు ఆ రంగ నాథంగారితో చెపితే మా అన్నయ్యను విడుదల చేయిస్తారు. చెప్పండి!

[లేచి కాస్సేపు నిలబడి నిలువలేక కడుపు పట్టు కొని "అబ్బా" అంటూ కూర్చుంటుంది.]

చల : నువ్వే ఒక్కసారి వెళ్ళి అడిగితే మంచిది. నీ కోర్కె కాదనలేడనుకుంటాను. పాపం! ఆకలిగా ఉన్నట్లుంది?

సీత : ఉంది... ఎవరితో చెప్పుకోను? పదిరూపాయలుంటే సర్దండి. అన్నంతిని ఎన్నో రోజులయింది.

చల : పదిరూపాయలు; పది కానులుగూడా రంగనాథంగారి మాటలేనిదే యివ్వలేను.

సీత : మీకు జాలిలేదు.

చల : జాలివుంది... కాని ఈ విషయంలో అస్వతంత్రుణ్ణి.

సీత : మీపిల్లా జెల్లకూడా తిండిపెట్టడం రంగనాథంగారి ఆజ్ఞ మీదే జరుగుతుందా?

చల : అవును.

సీత: పేదాబిక్కకీ మీరు ధర్మంచేయడంకూడా రంగనాథం గారి యిష్టంతోనే జరుగుతుందా?

చల : కాదని ఎలా అంటాను.

సీత : మీకు ఆలోచించుకొనే శక్తి లేదూ? మీరు మంచీ చెడ్డా గుర్తించలేరూ? ఆకలితో చస్తున్న జీవికి- అన్నదానం చెయ్యలేరూ?

చల : నన్ను బాగా అర్థం చేసుకున్నావ్ ... స్వామిభక్తన్ను, మరొకటను, ఆయనను కాదని ఏదీ చేయలేను సీతా!

సీత : ఒక మృగానికీ మీకూ తేడా ఏమిటి?

చల : సీతా!

సీత : ఒక రాక్షసుడికీ మీకూ వ్యత్యాసం ఏమిటి? మానవులుగా వుండేవాళ్ళే మమ్మల్ని పలుకరిస్తారు ... మీరెందుకొచ్చారు? మీలాంటి రాక్షసులకు మాయింట్లో స్థానం లేదు. వెళ్ళిపోండి. నన్ను ఆకలితో చావనివ్వండి.

చల : పాపం! ఆకలికొద్దీ ఏవేవో అంటున్నావ్, ఆలోచించుకో సీతా!

సీత : ఏమిటి ఆలోచించుకునేది?

చల : నీ బ్రతుకు తెరువు.

సీత : ఎప్పుడూ నాకిదే ఆలోచన.

చల : ఎందుకూ—ఆచరణ లేని ఆలోచన?

సీత : ఈ విషయంలో మీ ఆలోచన!

చల : ముందే చెప్పాను.

సీత : రంగనాథాన్ని ఆశ్రయించమనికదూ?

చల : నీ సుఖమైన జీవితానికి అది దారని ఊరికే చెప్పాను.

సీత : ఊరికే చెప్పారు. కోరకుండానే చెప్పారు ... దారి ... గోదారి ... చలపతిగారూ! మంచిగా చెబుతున్నాను. అవతలకు వెళ్ళండి.

చల : పాపం!

సీత : పాపం! ఏమిటా పాపం! పాపాన్ని ప్రోత్సహిస్తూ, ప్రతి నిముషం పాపాల్ని చేస్తూ, ఆపాపాన్నే ధ్యానం చేస్తున్నారు. పాపమట పాపం! వెళ్లిపొండి. బయటకు వెళ్లిపొండి. ఎదురుగావుంటే మీగుడ్లు పీకేస్తాను.

[పిచ్చియ్యతాత వస్తాడు.]

చల : పిచ్చియ్యా! చూచావా, మంచిచెప్పినా మనకు చెడు ఎదురౌతోంది.

పిచ్చి : బుల్లెమ్మా!

సీత : ఎవరూ చెప్పొద్దు. మీరు మాయింటికి రావద్దు. ఆవలకు పొండి, వెళ్ళిపొండి. (ఆకలిబాధ)అబ్బా!అయ్యో!

[మళ్ళీ మంచంమీద పడుతుంది]

చల : పిచ్చియ్యతాతా! నా గురించి తెలుసున్న మంచి చెప్పు. ఏమిటో అనుకుంటుంది, పాపం!

[చలపతి వెళతాడు.]

[పిచ్చియ్య మంచం దగ్గరగా వస్తాడు.]

పిచ్చి : బుల్లెమ్మా! సత్తెమిచ్చాడు సూడు.

సీత : (తుళ్లిపడి లేచి) ఏమిటీ?

పిచ్చి: కేశనుదగ్గిర,ఏదో వూరెల్లిపోతున్నానని యిదిచ్చాడు.

[ఉత్తరం యిస్తాడు.]

సీత : (కవరు తీసుకుని కంగారుగా చింపుతుంది. దానిలో అయిదురూపాయల కాగితాలకట్ట ఒకటీ, ఒక ఉత్తరం

వుంటుంది. ఉత్తరం ఆత్రుతగా చూస్తుంది) "సీతా! మిమను అమ్మేశాను. యాభై రూపాయలు మాత్రమే పంపిస్తున్నాను, తీసుకో." (చదువుతుంది) పిచ్చియ్య తాతా! త్వరగావెళ్లి సత్యాన్ని తీసుకురా. నాకు డబ్బు అక్కర్లేదని చెప్పు. తన డబ్బు వచ్చి తీసుకో మని చెప్పు.

పిచ్చి : ఎక్కడకు వెళ్లిపోయాడో?

సీత : ఏమని చెప్పాడు?

పిచ్చి : దానిలో అయిదు రూపాయలు నా కిమ్మన్నాడు. బతికచెడ్డోణ్ణి. అబద్ధమాడే ననుకునేవ్ బుల్లా.

సీత : ఇంకేం చెప్పాడు తాతా?

పిచ్చి : మీ అన్నయ్యా వచ్చేవరకూ యీ డబ్బెట్టి గడుపుకో మన్నాడు.

సీత : ఇంకేం చెప్పలేదూ?

పిచ్చి : బెంగపడొద్దన్నాడు. బుల్లెమ్మా! ఆ మొగం చూస్తే నా కడుపు చెరువై పోయింది. బుల్లెమ్మా! మాట్లాడు తుంటే గుడ్లలో నీళ్లుకూడా తిరిగాయమ్ కూడాను.

సీత : కళ్లల్లో నీళ్లు తిరిగాయా? ... ఏడుస్తున్నాడా?

పిచ్చి : అదే అనుకుంటాను బుల్లెమ్మా! నువ్వేమన్నాగాని అన్నావా?

సీత : వెళ్లిపొమ్మన్నాను తాతా. మరి మా యింటికి ఎప్పుడూ, వస్తూ పోతూ వుంటే లోకులేమనుకుంటారు?

పిచ్చి : ఏమనుకుంటారేంటి? మీకనాదులై పోయారని, ఏదో సాయంచేద్దామని వత్తున్నాడేమో. అట్లా అనొచ్చా బుల్లెమ్మా?

సీత : తప్పు చేశానంటావా తాతా?

పిచ్చి : తప్పా, మరీతప్పా. మీ గురించి ఎన్నెన్ని కష్టాలు పడ్డాడు. ఎంతెంత సాయంచేశాడు. ఆ మాత్రం గేనం లేదా బుల్లెమ్మా? పొగరబోతైతే అయ్యాడు. మనసు మా సక్కటి మనసమ్మా.

సీత : (ఏడుస్తూ) సత్యం!...

పిచ్చి : అయ్యో పిచ్చిదానా. దిక్కూ దివానంలేని రోజుల్లో... దేవుడిలా కాపాడే సత్తాన్ని కాదన్నావా?

సీత : ఇదిగో పిచ్చియ్యా తాతా! నీఅయిదు రూపాయలూ, సత్యమెక్కడున్నా కనిపిస్తే ఒక్కసారి రమ్మనిచెప్పు.

పిచ్చి : అలాగే!

సీత : ఎక్కడ కనుపించినాసరే, చెప్పు పిచ్చియ్యతాతా. నీకుడబ్బిచ్చినట్లు ఎవరితో చెప్పకేం?

పిచ్చి : చెప్పనుగాని, పంతులుగారు చూశారమ్మా.

సీత : ఎలా చూశారు?

పిచ్చి : సత్యం డబ్బిస్తుంటే చూశాడు. చూసినోడూరుకున్నాడా, శంకరంగారితో గూడ చెప్పాడు బుల్లెమ్మా.

నా యనకాలే పడ్డాడు. పొండొాశ అని గదురుకొని అట్టుకొచ్చాను.

సీత : అంతా చూశారా? అంతా వస్తున్నారా? నేనివ్వను. నా ప్రాణం పోయినా యివ్వను...యిది నా సత్యం డబ్బు. దాచుకుంటాను. (లోపల కెళ్ళబోయి ఆగి) తాతా! అబ్బ ఆకలేస్తోంది. చిల్లరేమన్నా వుందా?

పిచ్చి : నా దగ్గరెక్కడుంది బుల్లెమ్మా!

సీత : ఇవిగో! ఈ అయిదురూపాయలూ తీసుకొని తొందరగా అన్నం తీసుకురా.

[శంకరం వస్తాడు.]

సీత : (ఇచ్చేడబ్బు తీసుకొని) వచ్చారా! నా దగ్గర డబ్బు లేదు, వెళ్లిపొండి.

శంక : చేతులో పెట్టుకొని అబద్ధమాడతా వెందుకు? నాకు కళ్లులేవూ? పిచ్చయ్యా వినావా?

పిచ్చి : నాకెందుకుబాబీ గొడవ. అన్నం కావాలంటే ఎవరితోనన్నా తెప్పించుకో. ఎల్తాను బుల్లెమ్మా!

[వెడతాడు.]

సీత : ఇది నాడబ్బుకాదు. మరొకళ్లడబ్బు. శంకరంగారూ! అన్నయ్యవచ్చినతర్వాత యిస్తాడు మీరు వెళ్లిపొండి.

శంక : రేపు సత్యనారాయణ వ్రతం. వందరూపాయల ఖర్చు వుంది. చేతిలో కానికూడాలేదు. సీతా! నువ్వు యివ్వకపోతే ఏ విధంగానూ లాభంలేదు.

సీత : ఏం చేస్తారు?

[పంతులు వస్తాడు.]

సీత : పంతులుగారుకూడా వచ్చారు. నే నెవ్వరికీ యివ్వను, వెళ్ళిపొండి. (లోనికి వెళ్లబోతూ ఉంటుంది)

పంతు : ఆగు.

సీత : ఎందుకు?

పంతు : నాది పెద్ద మొత్తమేమీకాదు. ఎనిమిదిరూపాయలు. లేకపోయినా, అయిదు రూపాయలు పడేస్తే వెళ్ళి పోతాను.

సీత : అయిదు రూపాయలేగా! యిస్తాను.

శంక : నామాటేం చెప్పావ్?

సీత : మీకెంత యివ్వను?

శంక : నలభై రూపాయలు.

సీత : నలభై రూపాయలే! ఎవ్వరికీ యివ్వను. ఇద్దరూ వెళ్లండి ... ఊ ... వెళ్లిపొండి.

పంతు: అయిదు రూపాయలిస్తానన్నావుగా!

సీత : మీకిస్తే ఈయనక్కూడా యివ్వాలి.

శంక: నాబాకీ యివ్వందే వూరుకోను.

సీత : ఏమండీ! మీకు దయలేదూ? ఆకలితో మలమల మాడిపోతున్నానే, అన్నయ్య ఖైదు కెళ్ళిపోయాడే,

మా కాధారం ఎవరో చెప్పండి. ఈ డబ్బున్నా వుంచండిబాబూ. మీకు దణ్ణం పెడతాను.

పంతు: సీతా! మరాద్యగా యిస్తేనే యిచ్చావ్-

సీత : లేకపోతే!

శంక! దౌర్జన్యంగా తీసుకోవలసి వుంటుంది.

సీత : ఆగండి.

పంతు: అలా వీల్లేదు. యిచ్చివేయాలి.

సీత : నేనివ్వను, ఎవరికీ యివ్వను. (లోపలకు వెళ్ళిపోతూ వుంటుంది; చలపతి వస్తాడు)

చల : (బిగ్గరగా) సీతా!

సీత : ఏం?

చల : చాలా అపాయం జరిగింది.

సీత : ఎవరికి?

చల : రంగడికి.

సీత : ఏం జరిగింది?

చల : ఇంజను మీదనుంచి కాలుజారి క్రిందపడ్డాడు.

సీత : ఆఁ... (పరాకున చేతిలో డబ్బు విడుస్తుంది. పంతులూ, శంకరం తీసుకుంటారు)

శంక : అవసరానికి అందజేశావ్. చాలా సంతోషం. కను పిస్తూ వుంటాను. (వెళతాడు.)

పంతు: సీత పాపం తిండికోసం చాలా యిబ్బంది పడుతోంది. చూడండి చలపతిగారూ! (వెళ్తాడు)

చల : సీతా!

సీత : (తేరుకుంటుంది) ఏదీ! నా సత్యం పంపిన డబ్బు! పట్టుకపోయారా? (ఏడుస్తూ) బాబూ! మా రంగడికి ఏం అపాయం లేదుకదా?

చల : అపాయానికి ఉపాయాలుకూడా ఉన్నాయి సీతా! చేతికిదెబ్బతగిలింది, ఫర్వాలేదు. హాస్పటలుకు తీసుక వెళ్ళి కట్టుకట్టించా. బహుశా వస్తూనే వుండవచ్చు... సీతా! పనికిమాలిన పట్టుదలతో జీవితాన్ని నాశనం చేసుకుంటున్నావ్. ఆకలితో నువ్వు మాడి చచ్చిన తర్వాత, నీ శీలంగురించి ఎవ్వరూ గొప్పగా చెప్పరు కోరు. చేతగాక చచ్చింది సీతంటారు. నేను చెప్పే అదృష్టానికి ప్రపంచంలో చాలామంది ఎదురుచూస్తుంటారు. అందరకూ అవకాశంరాదు... అవకాశం వచ్చింది-వినియోగించుకో. రంగనాధంగారు కారు కూడా పంపించారు. నీకోసం ద్వారాలన్నీ తెరిచాడు. కావలసినతిండి, పంచభక్ష్య పరమాన్నాలూ కోరిన బట్ట- సిల్కులూ జరీప్లేటులతో మిలమిలా మెరిసే దుస్తులు. ప్రపంచంలో నువ్వుకోరిన వస్తువు ఏదైనా సరే నీ కాళ్ళదగ్గరకు వచ్చిపడుతుంది. రా! సీతా! రా!...

(వెళ్ళి చేయి పట్టుకుంటాడు. సీత వెనక్కుతగ్గి అలో చించి ప్లేటులున దవడమీద కొడుతుంది.)

చల : నీ ఆకలికి ఈ దెబ్బ ఆహారమా?

సీత : ఆకలి! ... ఆకలి!!

చల : (నవ్వుతాడు) ఆకలి ... ఆధారం చూపించాను. ఆలోచించుకో, కారులో కూర్చునివుంటా. రెండు నిముషాలు మాత్రమే. నీ ఆకలి తీరుతుంది; కావలసిన ఆశయం నెరవేరుతుంది. (నవ్వుతాడు)

[సీత క్రిందపడిపోతుంది; చలపతి బయటకు వెళతాడు. తిరిగి సీత మెల్లగా లేస్తుంది. అగమ్యంగా చూస్తుంది. నీతికీ అవినీతికీ లోపలినుంచి సంభాషణలు]

అవినీతి: ఆకలిదేవత ఆరాధనలో హారతి కాకుండా ఆకలి తీర్చుకోడానికి అడుగువేయి! (సీత వెళ్ళబోతుంది)

నీతి : ఆకలి తీర్చుకోడానికి ఆశయాలు నాశనం చేస్తావా? ఆదర్శాలు భగ్నంచేస్తావా ? (ఆగుతుంది)

అవినీతి: ఆకలి ముందు; ఆశయాలు, ఆదర్శాలు, అపురూప స్వరూపాలు - కావు. దానిముందు అన్నీ దగ్ధం కావలసిందే. (ఒకడుగు వేస్తుంది)

నీతి : ఆకలికోసం అవినీతిపాలయ్యే దానికన్నా నీతికి నిలబడి ప్రాణాలు త్యజించడం మంచిది. (వెళ్ళలేదు)

అవినీతి: చావు అంత సులభంకాదు. చావడమే మంచిదిగా ఎవ్వరూ అనుకోరు. బ్రతకడంకోసం ఆహారంకావాలి. ఆహారం కోసం బయలుదేరు. ఆకలిముందు కులమతాలూ, వంశమర్యాదలూ, నీతి, అవినీతి, దాసోహం కావలసిందే. ఆలోచనకు తావిచ్చి ఆలస్యం చేశావా

ప్రాణాలు పోతాయి. ప్రాణంపోయిన తర్వాత అన్న లేడు, తమ్ముడు లేడు. వెళ్ళు! నీ శరీరం నిలవాలంటే శరీరాన్నే వినియోగించు. నీతినీ, ఖ్యాతినీ నిలువునా ఖండించు, వెళ్ళు, వెళ్ళు.

సీత : (వెర్రిగా) చలపతిగారూ! వస్తున్నా. (వెళుతుంది)
[సీత వెలుపలకు వెళ్ళగా కారుహారన్ రెండుసార్లు మోగుతుంది.]

## ఛాయానటన (Shado play)

[వెంటనే లైట్లన్నీ ఆరిపోవాలి. షేడ్ ప్లేకు తగినట్లు ఒక తెల్లటి తెర ముందుకు రావాలి. క్షణంలో సామానులన్నీ తీసివేయాలి కాళీగా ఉండాలి రంగమంతా. తెర వెనక దూరంలో ఒక ఫోకస్ లైటు వెలగాలి. సీత ఆకలి బాధతో తూలుట్లాడుతూ తెర వెనక్కి వస్తుంది. ముందులో దారి చూపుతూ చలపతి ఉంటాడు. ఇద్దరూ నీడలుగానే కనిపిస్తారు. సీత భయపడుతూ ముందుకు వెళుతుంది. చలపతి కుడివైపు నకు చేయిపెట్టి వేలుచూపుతూ స్థాణువులా నిలబడిపోతాడు. సీత భయపడుతూ, బాధపడుతూ చలపతిని దాటి రెండడు గులు వేస్తుంది. కుక్క మొరుగుతుంది. సీత వెనక్కితగ్గి తిరుగముఖం పెట్టబోతుంది చలపతి చేయిపట్టుకు ముందుకు లాగుతాడు. సీత విసురుగా వెళ్ళి ముద్దలా తెరకొకమూల మోకరిల్లుతుంది. మళ్ళీ కుక్క మొరుగుతుంది. వెంటనే వికటమైన నవ్వుతో ఒక పెద్ద నీడ సీతముందుకు వస్తుంది. సీతచూసి కెవ్వున అరుస్తుంది. ఆ నీడ ఇంకా నవ్వుతూనే

వుంటుంది. చలపతి నమ్రతగా వంగి నమస్కారం చేసి వెళ్ళి పోతాడు.

నీడ ఆకారంలో ఉన్న రంగనాథం చేయి పట్టుకొని లేవదీస్తాడు. ఆమె వణుకుతూ లేస్తుంది. ఆమె ముఖంలోకి చూసి నవ్వుతాడు. వేలుతో సంజ్ఞ చేస్తాడు. ఒక పళ్ళెంతో ఫలహారాలు తీసుక ఒంట్రోతు వచ్చి సీతముందుగా నిలబడ తాడు. సీత ఆకలిగా ఆత్రుతగా వాటికేసి చూస్తుంది. రంగనాథం నవ్వుతూ ఒకవుండ ఆమెకు అందజేయబోతాడు. ముందుకు వస్తుంది. వెనక్కి వెళ్ళి ఆమెను ఆడిస్తాడు. అలాగే ప్యూన్ కూడా పళ్ళాన్ని వెనక్కి లాక్కుంటాడు. ఆమె శ్రమతో వాలిపోబోతుంది. రంగనాథం ఆమెను పడకుండా నిలిపి పళ్ళెం ముందు పెడతాడు. ఆమె ఆత్రంగా మెక్కుతూ వుంటుంది. రంగనాథం నవ్వుతూనే వుంటాడు. ఇంకో ప్యూన్ పానీయాలతో వస్తాడు. ఆమె కంగారుగా ఒకగ్లాసు తీసుకుని తాగబోయి ఏదో వాసన తగలగానే కంగారు పడు తుంది. ఆగ్లాసు మరో గ్లాసు షరబత్ లో కలిపి రంగనాథమే ఆమె నోటికి అందిస్తాడు.

బట్టలు తీసుక ఒక ప్యూన్ వస్తాడు. ఆమె తాగిన తర్వాత తూలుతుంది. రంగనాథం వినోదిస్తూ చీర మడత విప్పి ఆమెమీద విసురుతాడు. ఆమె చీర పట్టుకుంటూ తూలిపోతుంది. రంగనాథం చేతుల్లో వాలిపోతుంది. అతను ఆమె ముఖంలోకి చూస్తాడు.

అందరికీ సంజ్ఞ చేస్తాడు. బంట్రోతులు వెళ్ళిపోతారు— ఆమెను మరీ దగ్గిరికి తీసుకుంటాడు. కుక్క మొరుగుతూనే వుంటుంది. లైట్లు ఆరిపోతాయి.

గమనిక:— దీనిలో వచ్చే పాత్రలు ఈ నాటకంలో నటులే వేయవచ్చును. కుక్క మొరిగినట్లుగా మనిషే మొరగ వచ్చును.]

రంగ : అక్కా ... అక్కా : ఎక్కడికెళ్ళావ్ ... అక్కా ... అబ్బబ్బ. (మంచంమీద కూర్చుంటాడు)

[ఎడమచేతికి కట్టుకట్టి, మెడకు గుడ్డ తగిలించి వుంటుంది. బాధగాలోపల ప్రవేశిస్తాడు రంగడు. ఎవ్వరూ కనుపించరు. గదిలోకి వెళ్ళి చూస్తాడు. మళ్ళీ వెలుపలకు వస్తాడు.]

[పిచ్చియ్య ఒక బుట్టలో అరటిపళ్ళూ ఇతర తిను బండారాలతో వస్తాడు. రంగడు ఆశ్చర్యంగా చూస్తాడు. బుట్ట పరిశీలిస్తాడు.]

రంగ : ఎక్కడివి పిచ్చియ్యతాతా?

[పిచ్చియ్య సమాధానం చెప్పడు]

రంగ : అన్నయ్య జైలునుంచి విడుదలయ్యాడా?

పిచ్చి : ఇంకా లేదు బుల్లోడా.

రంగ : మరెక్కడివి?

పిచ్చి : మీ అక్క ...

రంగ: (భయంగా) మా అక్క ...ఎక్కడన్నా దొంగతనం చేసిందా? ఏం తాతా! మాట్లాడవ్వా? అక్కేది! ఎక్కడా కనుపించదేం?

పిచ్చి: ఏం చెప్పను బుల్లోడా.

రంగ: ఏం! ఏం జరిగింది?

పిచ్చి: కళ్ళు మూసుకొని కాలం గడిపేయడం మంచిది బుల్లోడా. కడుపు కోసుకుంటే కాళ్ళమీద పడద్ది.

రంగ: (కోపంగా) తాతా!
(పిచ్చియ్య భయంగా చూస్తాడు.)

రంగ: సరిగా చెబుతావా చెప్పు. తలాతోకా లేకుండా చెబితే నీమర్యాద దక్కనివ్వను.

పిచ్చి: చెప్పేదేముంది... రంగనాథం యింటికెళ్ళింది. పైగా కారెక్కెల్లింది. తోవలో నన్నుచూసి కారాపుచేసి, చలపతిగారు యీ సామానులు కొనిచ్చారు నీకిమ్మని.

రంగ: ఎవరూ? మా అక్క!

పిచ్చి: ఔను.

రంగ: ఎందుకెళ్ళింది?

పిచ్చి: ఎందుకేంటి బుల్లోడా. బ్రతం చెడగొట్టుకోడానికి.

రంగ: తాతా! మా అక్కను నీ కూతురనుకుంటున్నావేమో? మాఅక్క అలాంటి చెడ్డగుణం కలదికాదు.

పిచ్చి: ఓ మాసెడ్డ పతిబ్రత.

రంగ : తాతా!

పిచ్చి : ఆఁ! నేను కానిమాటన్నానా?

రంగ : కానిమాటే; మాకుటుంబంమీద నీకేమన్నా కక్ష ఉంటే మగాణ్నయిన నన్నేదన్నా అను. కాని అక్కనంటే!—

పిచ్చి : ఇదిగో! బుల్లోడోయ్! నా ప్రమాణకంగా మీఅక్క తప్పుడుదారి తొక్కినమాటనిజం. కాదని నువ్వనిపిస్తే చెప్పుదెబ్బలు తింటాను?...నమ్మినా?

రంగ : (భయాందోళనగా) నిజమా తాతా! నిజమా! ఇంత నీచమైనపని చేసిందా అక్క? తన జీవితానికి మచ్చ తెచ్చుకుందా అక్క!

[సూర్యం మాసిన తలతో, శుష్కించిన ముఖకవళికలతో, వస్తాడు. రంగణ్ని ఆశ్చర్యంగా చూస్తాడు, రంగడుకూడా చూస్తాడు.]

సూర్యం: రంగా!

రంగ : అన్నాయ్!

[ఆలింగనం చేసుకుంటారు. ఇద్దరి కళ్ళవెంబడీ నీళ్ళు కారతాయి.]

రంగ : (ఏడుస్తూ) నాన్న చచ్చిపోయాడు.

సూర్యం: (శిరస్సు స్పృశిస్తూ) విన్నాను రంగా! కష్టాలన్నీ కట్టకట్టుకొని మన మీదికే వచ్చాయి. ఏమిటీ కట్టు?

పిచ్చి: నువ్వెళ్ళిన తర్వాత మిల్లులో చేరాడుగా... కాలు జారి పడ్డాడు. చేయి విరిగిపోయింది.

సూర్యం: విరిగిపోయింది... చేయికూడా విరిగిపోయింది. మనందరి జీవితాలు విరిగిపోయాయి. ఆ రంగనాథం దాహంతీరుతుంది. చెల్లాయ్ ఏదీ?

[మాట్లాడరు]

ఎదురుగా వస్తుందనుకున్నాను. ఎక్కడా కనుపించ దేంరా రంగా! ఆకలితో మంచం ఎక్కిందా? చెల్లాయీ!

[లోపలికి వెళ్ళబోతాడు]

పిచ్చి: బుల్లోడా!

సూర్యం: ఏం?

పిచ్చి: తిండికేమీ యిబ్బంది లేదులే—

సూర్యం: ఇబ్బందిలేదూ? రంగడు సంపాదించాడా? చెల్లాయి ఆరోగ్యంగా వుందా?

పిచ్చి: ఉంది.

సూర్యం: ఉందా! రంగడే నాకన్నా చాల తెలివైనవాడు. చెల్లాయిఆకలి తీర్చాడు. నేనుండగా యింటిల్లిపాదినీ పస్తుపెట్టాను. మా నాన్నను తిండిపెట్టలేక చంపే శాను. (కళ్ళ వెంబడి నీళ్ళువస్తాయి)

రంగ: అన్నయ్యా!

సూర్యం: ఔను. నేనుఏడవకూడదు, యిదిసంతోషసమయం. నాకు శిక్షపడలేదు. లైసెన్సుకూడా వచ్చేసింది. ఏదీ

నా చెల్లాయ్? ఈ సంతోషవార్త చెపుతాను... ఎంత గానో ఆనందిస్తుంది. ఈ లైసెన్సు చూసి మురిసిపోతుంది చెల్లాయ్! చెల్లాయ్!

[లోపలకు వెళతాడు. పిచ్చియ్యా, రంగడు అగమ్యంగా చూస్తుంటారు. సూర్యం తిరిగి వస్తాడు.]

సూర్యం: (అనుమానంగా) ఏదీ యింట్లో లేదే! ఎక్కడికెళ్లింది రంగా?

రంగ: నేను వచ్చేటప్పటికే యింట్లో లేదు.

సూర్యం: ఏం పిచ్చియ్యా తాతా?

పిచ్చి: (మాట్లాడడు)

సూర్యం: (బిగ్గరగా) పిచ్చియ్యా తాతా!

పిచ్చి: ఏం చెప్పను!

సూర్యం: చెప్పాలి... ...తప్పదు. నా చెల్లాయిని చూడాలి. ఎక్కడుందో! ఎలావుందో! చూడాలి.

పిచ్చి: దానికేం రాయిలావుంది.

సూర్యం: ఎక్కడ?

పిచ్చి: రంగనాధం దగ్గరే.

సూర్యం: (ఒక్కసారి నిర్విణ్ణుడౌతాడు) ఆఁ... ...రంగనాధం దగ్గరా...రంగనాధం దగ్గర!

పిచ్చి: అవును బుల్లోడా. చలపతివచ్చి తీసుకుపోయాడు.

సూర్యం: ఎందుకూ?

పిచ్చి: ఇంకెందుకూ? నా కూతురు బతుకులాగే కాలిపోడానికి.

సూర్యం: (ఉన్మాదంగా) నీ కూతురు బతుకులా కాలిపోటానికి ... నీకూతురు బతుకులా కాలిపోటానికా, పిచ్చియ్య తాతా. నువ్వు దొంగవు! నువ్వే చేశావు ... నువ్వే ప్రోత్సహించావ్. నువ్వు నీచుడవు.

[వెళ్ళిభుజాలు పట్టుకుంటాడు]

రంగ : అన్నయ్యా!

పిచ్చి : దణ్ణం బాబో.

సూర్యం: (విడిచి పెడతాడు) పిరికి వెధవవి. నిన్నేం చేయను. నిన్ను చంపితే మాత్రం లాభమేముంది? చెల్లాయి కాదు; విషనాగు. దాన్నే చంపుతాను. (వెళ్ళబోతాడు)

రంగ : (ఏడుస్తూ) అన్నయ్యా అక్కను చంపేస్తావా?

[సూర్యం వెనక్కు తిరిగి]

సూర్యం: అవును ... చంపుతాను. నీకు భయంగా వుందా! అక్క రక్తం చూడ్డం అంతగా భయమయితే కాస్సేపు కళ్లు మూసుకుందువుగాని. లేదా, బైటకు వెళ్లిపోదువుగాని. (వెళ్లిపోతాడు.)

రంగ : పిచ్చియ్య తాతా! అక్కను రక్షించాలి. ఆమె చెడ్డ పని చేస్తే వూర్నుంచి పారిపొమ్మను. వూళ్లో వుండ వద్దనిచెప్పు. తాతా వెళ్లు. (పిచ్చియ్యతాత వెళ తాడు)

[రంగడు మంచం మీాద కూలబడి ఏడుస్తూవుంటాడు. మెల్లగా సత్యం వస్తాడు. రంగడు చూస్తాడు.]

రంగ : సత్యం!

సత్యం: రంగా!

రంగ: చాలా అపాయం జరుగుతోంది. అన్నయ్య అక్కను చంపడానికి వెళ్లాడు.

సత్యం: కారణం?

రంగ : రంగనాథమింటికెళ్లిందని.

సత్యం: అంతేనా!

రంగ : కాదు... మళ్ళీ మనం తలలు ఎత్తుకు తిరగకుండా చేసింది.

సత్యం: నిజమా!

రంగ : పిచ్చియ్య తాతే చెప్పాడు.

సత్యం : ఎప్పుడు వెళ్ళింది?

రంగ : ఈరోజునే.

సత్యం : నువ్వు లేవా!

రంగ : ఊహుఁ. చేయి విరిగింది. చలపతి హాస్పటల్‌కు తీసుకు వెళ్లికట్టుకట్టించాడు. అక్కతో చెప్పివస్తానని బయలు దేరాడు. మళ్లీ వాడు రాలేదు. నేను యింటికి రావడం ఆలస్యమయింది.

సత్యం: నేను పంపిన డబ్బు అందలేదూ!

రంగ : నాకు తెలీదు.

[సత్యం వెళ్లిపోతాడు. రంగడు చేయి బాధవల్ల మంచంమీాద పడుకుంటాడు. మంచి దుస్తులతో

ముసుగు వేసుకొని సీతవస్తుంది. వెనకాల పిచ్చియ్యా తాత వస్తాడు. పిచ్చియ్యవెళ్లి రంగణ్ణి లేవగొట్టబోగా సీత భయంగా వద్దని చెప్పి, లోపలకు వెళ్లి పోతుంది. సీత వెళ్లిన తర్వాత అలికిడి విని రంగడు లేస్తాడు. పిచ్చియ్యచేతిలో రొట్టె, పాలగ్లాసువుంటుంది.]

రంగ: ఏంతాతా! కనుపించలేదూ?

పిచ్చి : కనుపించింది బాబూ!

రంగ: నేను చెప్పింది చెప్పావా?

పిచ్చి : చెప్పాను... కాని వినలేదు.

రంగ : వినలేదూ? వినదు. ఎందుకింటుంది... దానిచావు దగ్గరకొచ్చింది. కాబట్టే వినలేదు. రంగనాధంగాడు కాపాడతాడని కళ్లు పొరలుగిమ్మ్రు పోయాయను కుంటాను. సరే, యిలాంటిది చచ్చినా ఫరవాలేదు.

[వెళ్లి మంచంమీద కూర్చుంటాడు]

పిచ్చి: కట్టకాలమే కానిపనులు చేయిత్తాది... బాబూ, నీ గురించి ఎంత ఏడ్చిందనుకున్నావ్... ఇదిగో పాలూ రొట్టె కూడా యిచ్చింది తీసుకో బాబూ.

రంగ: (ఏడుస్తూ ) వద్దు తాతా!

పిచ్చి : తమ్ముడన్నా, అన్నగారన్నా, ఆ సీతమ్మకు ఎంత దయ. ఆకరికి సత్తాన్ని కూడా ఆవలికి పొమ్మందిగా నలుగురూ ఏమన్నా అనుకుంటారని. పాపం! సరే, బాబూ యిది తీసుకో ఆకలిమీదుంటాది పాణం.

రంగ : నేను తినలేను తాతా! తీసుకెళ్ళి అక్కడ పెట్టెయ్యి.

పిచ్చి: అలాకాదు బాబూ తీసుకో. తినకపోతే మీ అక్క ఏడుస్తాది.

రంగ : నీతోనే చెబుతున్నాను తాతా! నా కక్కల్లేదు. తీసుకు వెళ్ళిపో.

పిచ్చి : బాబ్బాబు. (దగ్గరగా వెడతాడు)

రంగ: (పిచ్చియ్య చేతిలోవున్న సామానులువిసిరికొడతాడు) ఛో... అదిచ్చిన ఏవస్తువైనా నేనుతీసుకోను. విషంతో సమానం. అది నాకక్కకాదు.(ఎదురుగా చూస్తాడు. గుమ్మంలో విచారంగా,బాధగా,ఆశ్చర్యంగా రంగకే కేసి సీత చూస్తూ నిలబడి వుంటుంది.)

పిచ్చి: సీతమ్మా ! నువ్వే సెప్పమ్మా.

రంగ: (చూపులో ముందు ప్రేమ, తరవాత ఈర్ష్య, ఆ వైనుక క్రోధం చుట్టుముట్టుకొస్తాయి.) ఏంతాతా! యింట్లోకి తీసుకొచ్చి అబద్ధమాడుతున్నావ్!

పిచ్చి : నాకెందుకు బాబీగొడవ. (వెళ్ళిపోతాడు)

రంగ : (సీతను చూసి) ఎందుకొచ్చావ్ మళ్ళా? ఏం పని చేశావ్?

సీత : (ఏడుస్తూ) రంగా! చేయాలని చేయలేదు. ఏలాగు చేశానో, నాకాళ్ళు ఎలాగు నడిచివెళ్ళాయో నాకే తెలియదు. కాలే కడుపుతో, ఎండేడొక్కలతో,

కేవలంతిండికోసం—అన్నయ్యానూ, నిన్నూ మూర్ఖానికి ప్రాణం నిలుపుకోవడంకోసం, ఆ చలపతి సహాయంతో రంగనాథం గుమ్మం తొక్కాను. తిండి పెడతానని లోపలకు తీసుకెళ్ళాడు. ఆ రంగనాథం నన్నుచూసి వికటంగా నవ్వాడు. కెవ్వున కేకవేసి స్మృహతప్పి పడిపోయాను. నేను ఎవ్వరికీ మొహం చూపలేక లోపలదాక్కున్నాను. నాకన్నా చిన్నవాడవు. నీకు సిగ్గుపడే నీ ఎదుటకు రాలేకపోయాను. తప్పుచేశాను... నేను చేసిన తప్పు నారంగడికి ఆలోచించుకునే శక్తి యిచ్చింది. ఆటుతూపాడుతూన్న రంగడి మెదడులో యింత విశాలమైన ఆలోచనలున్నాయని గ్రహించలేకపోయాను. రంగా! ఇలా చూడు! రొట్టె తిను బాబూ!

రంగ : అక్కర్లేదు.

సీత : ఆకలి కావడంలేదూ?

రంగ : కడుపు నిండుగానే ఉంది.

సీత : అవును.

రంగ : నీకు సిగ్గు లేదూ?

సీత : చచ్చేదానికి సిగ్గెందుకూ?

రంగ : అంత నీచమైనపని చేయకపోతే మాడి చావలేక పోయావూ?

సీత : చావలేకపోయాను—చెప్పడం సులభమే. కాని...

రంగ : చేయడం కష్టం.

సీత : అవును. నా బ్రతుకుమీద నాకు తీపిలేదనను. గాని కొందరి బ్రతుకులు నేను లేకపోవడంవల్ల నాశనమౌతా యని యింతవరకూ బ్రతికున్నాను.

రంగ : అన్నయ్యా వస్తాడేమో ఏం చెపుతావు?

సీత : అబద్ధం చెప్పను.

రంగ : అబద్ధం చెప్పినా దాగదుగా.

సీత : అందుకు నిజం చెప్పాలనికాదు. బ్రతుకుమీద ఆశలేనప్పుడు ఏది చెప్పినా ఒకటే.

రంగ: చచ్చిపోవడం నీకంత తేలిగ్గావుందా? అన్నయ్యా రాక ముందే ఎక్కడికన్నా వెళ్లిపోరాదూ?

సీత : రంగా!

రంగ : ఔను. అన్నయ్యా వస్తే నిన్ను బ్రతకనివ్వడు. చచ్చేం సాధిస్తావు? నామాట విను. ఎక్కడికన్నా వెళ్లిపో.

సీత : వెళ్ళలేను రంగా. చాటుగా బ్రతకడం నేను నేర్చుకోలేదు. స్వచ్ఛంగా బ్రతకాలనుకున్నా, పరిస్థితులు నా బ్రతుకుమీద ఒక నల్ల మచ్చను ఏర్పర్చాయి. ఈ మచ్చకు యింకో మచ్చ చేర్చుకొని మరీ చీకటి బ్రతుకు బ్రతకలేను.

[సూరయ్య వస్తాడు. మనిషి కోపంతో మండిపోతూ వుంటాడు. చెల్లెల్ని చూస్తాడు. రంగడు కంగారుగా లేస్తాడు.

సీత అన్న స్వరూపాన్ని చూసి భయపడుతుంది. తర్వాత ధైర్యం తెచ్చుకుంటుంది]

సూర్యం: ఎంత ఘోరం చేశావ్!

సీత : చేశాను.

సూర్యం: మా వంశానికి మచ్చ తెచ్చావు. నాన్న బ్రతుక్కి కళంకం తెచ్చావు. మా తలలు త్రెంచేశావు.

సీత : అవును.

సూర్యం: నిన్ను చంపేముందు ఒకటడుగుతాను నిజం చెబుతావా!

సీత : ఊఁ.

సూర్యం: నన్ను జైలునుంచి విడుదల చేయించింది నువ్వేనా?

సీత : రంగనాథంగారితో చెప్పాను. అంతే.

సూర్యం: నాగురించే రంగనాథం దగ్గరకు వెళ్ళావా!

సీత : నా కాలేకడుపు గురించి.

సూర్యం: పడుపువృత్తి చేశావ్.

రంగ : అక్క చెయ్యాలని చెయ్యలేదు. చలపతే తీసుకెళ్లాడు.

సీత : ఎవరు తీసికెళ్ళినా, ఎవరు వచించినా, నేను పతితనయ్యాను. పిచ్చియ్యతాత కూతురుజీవితం గురించి అసహ్యించుకొన్నాను. సత్యం ఆమెను సమర్థిస్తుంటే సహించలేకపోయాను. కాని నాగురించి ఎవరూ కష్టపడ్డం, నష్టపడ్డం నా కోరిక కాదు. ఇదిగో అన్నాయ్!

(కైజారు తీసి) తీసుకో. ఒకనాడు నీ చేతిలోంచి లాగి దాచిన కైజారు. ఆలోచించక తీసుకో.

సూర్యం: (ఆలోచిస్తూ అందుకుంటాడు) ఇలాచేస్తే నేనువిడిచి పెడతానని ఆలోచిస్తున్నావా ?

సీత : అన్నాయ్?

సూర్యం: లేకపోతే ఈ పనేమిటి? నీ విషయం తెలిసింది. తెలిసినప్పుడే నాతల వాలిపోయింది. వాలినతల రాలి పోవడమే నాకిష్టం. అయితే నా తల నేలకొరిగే ముందు నా తలవంపులకు కారణమైన నిన్ను విడచి పెడతానని అనుకోవద్దు. అన్నయ్య జైల్లోకిపోయి, నాన్నచచ్చిపోయి, రంగడిచేయి విరిగిపోయి,కుటుంబ మంతా నాశనమైపోయుంటే, నువ్వు కుమిలి చావా ల్సిన దానికి బదులుగా, ఆ రంగనాధం చేతుల్లో కులక డానికి యిల్లు విడిచావా? ఇక అన్నయ్య జైల్లోనే చచ్చిపోతాడని,రంగడు ఆస్పత్రిలోనే ప్రాణం విడుస్తా డనీ, ఆరంగనాధాన్ని అండగా చేసుకొనడానికి నేనం టూ బయలు దేరావా ?

సీత : అన్నాయ్! (కోపంగా) అనవసరంగా మాట్లాడకు. నేను నిన్ను ఎదిరించి ఎప్పుడూ మాట్లాడలేదు. ఇప్పుడు మాట్లాడకుండా వుండటానికి ప్రయత్నంచేస్తే, నన్ను మరీ నీచంగా అర్థంచేసుకుంటున్నావ్. రంగనాధం అండ నాజీవితానికి ఆధారమనుకుంటే, ఈ గుమ్మం తొక్కను. ఇంతగా మాట్లాడనివ్వను. అసలు నిన్ను యింత త్వరగా యిల్లుచేరుకోనివ్వను. ఇంతగా కుమిలి

చావను... ఈ బాధ మీ గురించి కాదు... సమాజం గురించి కూడా కాదు. పవిత్రమైన భారతనారి ఆదర్శాన్ని కోల్పోయానని బాధపడుతున్నాను.

సూర్యం: రంకునేర్చినది బొంకునేర్వడం ఆశ్చర్యంలేదు.

సీత : దొంగవాడు వింతగా మాట్లాడుతున్నాడని నేనంటే?

సూరం: ఎవరు దొంగ?

సీత : రంకునేర్చిన దెవరు?

సూర్యం: నువ్వే నువ్వు.

సీత : దొంగవు నువ్వే.

సూర్యం: ఆఁ! నేనా, నేనా... నీగురించి... నాన్నగురించి... ఆహారం తీసుకవస్తే, దొంగ|కింద జమకడతావా? వ్యభిచారీ! కులటా! దుర్మార్గురాలా!

[సూర్యం చెల్లెలికంఠాన్ని పట్టుకుంటాడు. ఆమెకళ్ళు తేలవేస్తుంది. రంగడు అడ్డుపడతాడు. సూర్యం రంగణ్ణి కాలుతో గెంటివేస్తాడు. రంగడు పడిపోతాడు. సూర్యం మరీగట్టిగా చెల్లెలికంఠాన్ని నొక్కుతాడు. ఆమె భీకరంగా కెవ్వున అరుస్తుంది. సత్యం కంగారుగా వస్తాడు.]

సత్యం: ఆగు.

సూర్యం: ఆపుచేయడానికి వీల్లేదు. ఆపుచేశావా-నీమర్యాద దక్కదు.

[సూర్యం చేతులు పెనగలాగి సీతనుచూస్తాడు. సత్యం చేతిలోనుంచి తేలకళ్ళు వేస్తూ క్రిందకు వాలిపోతుంది.

రంగడు లేచి సీత మొహంలోకిచూసి "అక్కా-" అని బిగ్గరగా అరచి క్రింద పడిపోతాడు.]

సత్యం: (సీతను పరిశీలిస్తాడు; సూర్యాన్ని చూస్తాడు) సీకోరిక నెరవేరింది. ఆమె చచ్చిపోయింది.

సూర్యం: (భయంగా) చచ్చిపోయిందా? (బింకంగా) చావ వలసిందే.

సత్యం: చావవలసిందే. వ్యభిచారానికి శిక్ష చావు. ఈ వ్యభిచారానికి కారణం ? సమాధానం చెప్పవేం ? నువ్వు దొంగతనం చేయడానికి కారణం ? ... ఆకలికోసం - అన్నని జైలునుంచి విడుదల చేయడం కోసం - నీకు లైసెన్సు యిప్పించడం కోసం... ఈ పని చేసింది. క్షుద్బాధ తీర్చుకుంది... అనుకున్న పనులన్నీ నిర్విఘ్నంగా చేసింది. నువ్వు దొంగతనం చేశావ్...నీ ఆకలి తీర్చుకున్నావా? నీ తండ్రిని రక్షించావా ? నీ తమ్ముడిని కాపాడావా?... కార్యభంగంతో కాలు కదిపావు జైలుకి... వీళ్ళెలా బ్రతుకుతారనుకున్నావ్ ... ఈమె - పరిస్థితులవల్ల చేసినపనికే ఇంత పెద్ద శిక్ష యితే - నువ్వు చేసిన నేరానికి ?

సూర్యం: నేరం?

సత్యం: నువ్వు దొంగతనం చేశావ్.

సూర్యం: చేశాను... కారణం ఎవ్వరు ?

సత్యం: కారణం తెలియకుండానే నేరాన్ని నిరూపించి ఈమెకు మరణాన్నే శిక్షగా యిచ్చావ్. నీ తప్పానకు నువ్వు కారణం కాదు.

సూర్యం: కాదూ?

సత్యం: సీత తప్పు చేయలేదు.

సూర్యం: చేయలేదూ?

సత్యం: చేసింది... కారణం ఆమె కాదంటున్నాను. ఆమెలో కామోద్రేకం ఆపని చేయించలేదంటున్నాను. ఆమె అందచందాలకోసం, మిద్దెలూ, గద్దెలూ ఎక్కడానికి ఈ పని చేయలేదంటున్నాను. సెక్సంటూ చంకలు ఎగురవేసుకోడానికి యీపని చేయలేదు. కేవలం ఆకలి కారణంగా యీపనిచేసింది. చాలామంది ఆకలికోసం వ్యభిచరిస్తున్నారు. ఆకలికోసం దొంగలయ్యారు. ఆకలే ఈ పని చేయించింది. ఆకలిని సృష్టించింది సమాజం. సమాజాన్ని నడిపించేది డబ్బు.

సూర్యం: (ఏడుస్తూ ఉద్రేకంగా) చెల్లాయ్! (దగ్గరకు రాబోతాడు)

సత్యం: ఈమెను అంటడానికి నీ కధికారంలేదు. నువ్వు నీచుడవు. చెల్లెల్నే చేతులారా చంపిన రాక్షసుడవు. నీ మొహం చూడ్డమే మహాపాపం.

[సూర్యం కుళ్ళి ఏడుస్తూ లోపలకు వెళతాడు. శవం దగ్గరగా తలవంచుకొని సత్యం కూచ్చుని వుంటాడు. లోపల భయంకరంగా కేకవినిపిస్తుంది. సత్యంలేస్తాడు. రంగడు

ఏడుస్తూనే వుంటాడు. చేతులనిండా రక్తం, [కైజారుతో సూర్యం గుండెలనుండి రక్తం కార్చుకుంటూ వస్తాడు.]

సత్యం: (భయంగా) సూర్యం!

[వెళ్ళి పట్టుకుంటాడు. సూర్యం మళ్ళీ పొడుచుకో బోతుండగా, ఆపు చేస్తాడు. రంగడు "అన్నయ్యా!" అంటూ ఏడుస్తూ సూర్యాన్ని పట్టుకుంటాడు.]

సూర్యం: (తూలుతూ) శిక్ష ... నాకుకూడా శిక్ష ... నా చెల్లెలితో బాటు నాకుకూడా శిక్ష. చెల్లాయ్! (ఏడుస్తూ సీత కాళ్ళదగ్గర పడిపోతాడు.)

[సత్యం సూర్యంచేతిలో కైజారు తీసుకొని భయంగా ఇద్దర్నీ చూస్తాడు.]

సత్యం: అన్నదొంగ... చెల్లెలు వ్యభిచారిణి. "అన్నా-చెల్లెళ్లు" ఆకలి దేవత ఆరాధనలో శాశ్వత నిర్వికల్ప సమాధి నందుకున్నారు.

[ఎస్. ఐ; పోలీసు, చలపతి, శంకరం, పంతులు, పిచ్చియ్య వస్తారు. ఎస్. ఐ. సత్యంచేయి పట్టుకుంటాడు.]

ఎస్.ఐ: అరెస్టు.

చల : ఇద్దర్నీ చంపేశావ్.

సత్యం: వీళ్ళిద్దర్నీ నేను చంపలేదు. ఆకలితో మాడేవాళ్ళంద రినీ నేను చంపడల్లేదు. చంపేవాళ్లు మీలాంటివాళ్లు. మీ రంగనాథంలాంటి వాళ్ళు. ఈ పంతులులాంటి వాళ్ళు.

ఎస్. ఐ: షటప్.

సత్యం: నోరు జారవిడువకండి. నేను సిద్ధంగా వున్నాను.

రంగ : (ఏడుస్తూ) బావా!

సత్యం: భయంలేదు రంగా! చేయి విరిగిపోయిందిగా! చేతులూ, కాళ్ళూ కళ్ళూ లేనివాళ్ళకు...పుణ్యం కోసం ధర్మం చేస్తారు పెద్దలు. స్వేచ్ఛగా బ్రతుకు!

[ఎస్. ఐ. సత్యంచేయి పట్టుకుంటాడు.]

—♦ నేపథ్య గీతం ♦—

సాక్షి : అయ్యో...అమాయకులపైన కక్షా
నిరామయులకేనా శిక్షా...
పాపాలకు పడగెత్తేవారికి
జీవితమంతా వేడుకలా ! !...॥
ఇదా ధర్మము - ఇదా న్యాయము
ఇదా లోకసామాన్యము
లేదేమో మంచికి స్థానము...

[పాట పూర్తిఅయ్యేలోపులో నే తెర మెల్లగా జారుతుంది.]

---

# తన జీవిత బాటలో మన రచయిత

1920 గోదావరి జిల్లా నర్సాపురంలో జననం. కష్టాల్లో గడచిన జీవితం కళాశాల విద్యార్జనకు కారణం కాలేకపోయింది. వీరు స్వయం కృషితోనే సాధించిన రచనా సామగ్రితో హృదయాలను రసమయం చేసే విధానంలో రచనను సాగించారు. అనుకరణలూ, ఆధారాలూ గాక వ్రాసినవన్నీ స్వకపోల కల్పితాలే అయ్యాయ్. తమ కాళ్లమీద తాము నిలబడే రచయితల్లో ఒకరుగా వీరుకూడా నిలుస్తారు.

1940 నుంచి పాలకొల్లులో నివాసం. ఆదర్శనాట్యమండలి అనే నాటక సంస్థను స్థాపించి పదేళ్లుగా నాటక రచనలో నటనలో, మండలి నిర్వహణలో, కృషిచేసి కృతకృత్యులయ్యారు.

1950 ఆంధ్ర నాటక కళా పరిషత్తులో వీరి పల్లెపడుచు నాటకం ఉత్తమ ప్రదర్శనా బహుమానాన్నీ — ఆడది నాటిక ఉత్తమ రచనా బహూకృతినీ అందగలిగాయి. బాగా ప్రచారం పొంది వేలాది ప్రదర్శనలిచ్చిన వీరి నాటకాలు "పల్లెపడుచు", "అన్నా-చెల్లెలు", "కులంలేని పిల్ల".

ఆనాటినుంచి మద్రాసు చిత్రసీమలోవుంటూ "సంతానం" "ఇలవేల్పు" "పరివర్తన" "పల్లెపడుచు" "అత్తాఒకింటికోడలే" "ఆడపెత్తనం' అనే చిత్రాలకు కథా మాటలు, "వదినగారిగాజులు" "రాజూపేద" మొదలగు చిత్రాలకు మాటలు రచించి, సుప్రసిద్ధ చలన చిత్ర రచయితగా కూడా పరిచయమయ్యారు.

వీరు రచించిన "దక్షత" "మమత" అనే నవలలు రెండూ నవలా సాహిత్యంలో ఒక ప్రత్యేకతనుపొంది. బహుళ పాఠకలోకాన్ని ఆకర్షించాయి.

1960 లో రవుతు పిక్చర్సు అనే చలనచిత్ర సంస్థను నెలకొల్పి " నిత్యకళ్యాణం — పచ్చతోరణం " అనే చిత్రాన్ని నిర్మిస్తూ రచన-దర్శకత్వం కూడా నిర్వహించారు. ఆ చిత్రం ప్రముఖుల, పత్రికల, ఆంధ్ర మంత్రుల, ప్రేక్షకలోకం యొక్క ప్రశంసలనందుకొని ఉత్తమ చిత్రాన్ని తీసిన గౌరవం పొంది - మంచి దర్శకుల జాబితాలోకూడా చేరారు.

స్వయంశక్తి మీదనే ఆధారపడి సాధనద్వారా, వ్యక్తిత్వంవల్ల జీవితాన్ని మెట్లు మెట్లుగా విభాగించుకొని, ఒక్కొక్క సోపానాన్ని పైకెక్కుతూ కళావిజయమే జీవితాదర్శంగా పయనిస్తున్న వీరి గమనం ఉజ్వలమై, మంగళప్రదమై, తెలుగుగడ్డలో, వెలుగువారిగా మనగలరని మేము ఆకాంక్షిస్తూన్నాము.

ఇట్లు,

ప్రకాశకులు

